

ఋక్ యజు అథర్వవేదీయ

# వైదిక సుప్రభాతం

(భగసూక్త వైదిక వైజ్ఞానిక సరళార్థం)




మంత్రకర్త :

**"ఓ3మ్" నామక సర్వాంతర్యామి**

సరళార్థ కర్త :

**సుమ్మార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)


ముద్రణ - వితరణ :

**ఆర్యసమాజము - సీతాఫలమండి**

మెయిన్ రోడ్డు, సీతాఫలమండి,

సికింద్రాబాద్ - 500 061. (తెలంగాణ)

ఫోన్ : 27071816, 9133134156, 9246174018



# సృష్టికర్త ఉపదేశం

ఓం ప్రాతరగ్నిః పురుప్రియో విశః స్తవేత+అతిథిః ।
విశ్వాని యో అమర్త్యో హవ్యా మర్తేషు రణ్యతి ॥

– ఋగ్వేదం (5-18-1)

ఓ మానవులారా! అతిథులను మీరు చక్కగా సేవించండి. అతిథులంటే ముందుగా తమ రాకను తెలుపకుండా లోకసంచారం చేస్తూ వేదధర్మాలను ఉపదేశించే పూర్ణ విద్వాంసులైన సంన్యాసులు, సాధుమహాత్ములు. అట్టివారే నిజమైన అతిథులు. వారు అగ్నిహోత్రం వంటి పవిత్రులు. అట్టివారి వల్లనే లోకానికి గొప్పమేలు జరుగుతుంది. వారే ఆత్మపరమాత్మలను గురించి చక్కగా ఉపదేశించగలరు. మీలోని మూఢనమ్మకాలను తొలగించగలరు. సత్యాన్ని నిర్భయంగా నిస్సంకోచంగా చెప్పగలరు. ప్రాతఃకాలంనుండి రాత్రివరకు లోకానికి మేలు చేస్తూనే ఉంటారు. అట్టివారిని ఉదయ సాయంకాలలో సాదరంగా ఆహ్వానించి సత్కరించి ఉపదేశాలు పొందండి.

O Men! only the absolutely truthful guest is to be reverred. He knows well the mystery of soul and God. Preacher of truth, highly learned, beloved of the enlightened persons and well-wisher of all like God, He is ever cheerful. He is purifier like Agnihotra. They deliver sermons to the people from morning till night.



ఋక్ యజు అథర్వవేదీయ

# వైదిక సుప్రభాతం

(భగసూక్త వైదిక వైజ్ఞానిక సరళార్థం)



మంత్రకర్త :

**"ఓ3మ్" నామక సర్వాంతర్యామి**

సరళార్థ కర్త :

**సుమ్నార్థి**

(డా. కోదూరి సుబ్బారావు)


ముద్రణ - వితరణ :

**ఆర్యసమాజము - సీతాఫలమండి**

మెయిన్ రోడ్డు, సీతాఫలమండి,

సికింద్రాబాద్ - 500 061. (తెలంగాణ)

ఫోన్ : 27071816, 9133134156, 9246174018

వైదిక గ్రంథమాల : 4

# వైదిక సుప్రభాతం

(భగసూక్త వైదిక వైజ్ఞానిక సరళార్థం)

సృష్టి సంవత్సరము : 197, 29, 49, 116.

విక్రమాబ్దము : 2072.

దయానందాబ్దము : 192.

శ్రీ మన్మథ నామ సంవత్సరం, శ్రావణ శు॥ పౌర్ణమి, శనివారం.

తేది : 29-08-2015.

**మూల్యము :** మీరు పూర్తిగ చదవటం, మరొకరికి ఇవ్వటం.

ప్రతులకు :

**ఆర్యసమాజము - సీతాఫల్‌మండి,**

మెయిన్ రోడ్డు - సీతాఫల్‌మండి,

సికింద్రాబాదు - తెలంగాణ 500 061.

ఫోను :- 040-27071816, 9133134156, 9246174018.

Email : aryasamajsitafalmandi@gmail.com

**డి.టి.పి. & ప్రింటింగ్ :**

**విక్రాంత్ ప్రింట్ హౌస్,**

వారాసిగూడ, సికింద్రాబాద్ - 500 061.

ఫోన్ : 9705085608.



## ప్రాక్కథనం (Foreword).

వేదాలు సర్వవిద్యానిలయాలని మహర్షులు, మహాత్ములు, మతాచార్యులు అందరూ అన్నారు. నేడు లోకంలో కనబడే సత్యవిద్యలే కాక సమస్త విద్యా విజ్ఞానాలకు, కళా కౌశలాలకు, వృత్తి సాంకేతికతలకు కూడా వేదాలే మూల గ్రంథాలని పరిశోధకులంటున్నారు. భారతీయులేకాక విదేశీ సంస్కృత విద్యాంసులును ఈ సత్యాన్ని గుర్తించి తమ తమ గ్రంథాలలో ఉదహరించారు. అట్టి వేదాలలో మన దినచర్యకు, సమాజచర్యకు అవసరమైన మార్గదర్శకాలు చాలానే ఉన్నాయి. మన నిత్యకృత్యాలు నిద్రలేవటంతో ప్రారంభమౌతాయి. కనుక నిద్రలేవగానే పఠించవలసిన మంత్రాలతో మొదలుపెట్టి వైదిక దినచర్యను వైజ్ఞానికంగా తెలుపాలని నాకు కొంతకాలంగా సంకల్పాలు కలుగుతున్నాయి. వాటి కార్యరూపంగా ఈ లఘుగ్రంథం "వైదిక సుప్రభాతం" వ్రాసాను. తదుపరి మంత్రాలకు, క్రియలకు కరపత్రాల ద్వారా తెలిపే ప్రయత్నం చేస్తాను.

ఈ కలియుగంలో వేదాలను పునరుద్ధరించి జన సామాన్యాని కంతటికి అందించిన మహానుభావుడు మహర్షి దయానంద సరస్వతిగారు. వారు కేవలం వేదాలను ఉద్ధరించటమేగాక ప్రాచీన ఋషులు వ్రాసిన వేదభాష్యాల ననుసరిస్తూ చక్కటి వైజ్ఞానిక వేదభాష్యం వ్రాశారు. వారు వ్రాసిన వేదభాష్యం ప్రపంచ సంస్కృత విద్వాంసుల కళ్లు తెరిపించింది. కొందరు విశాలహృదయులు సహృదయతతో ఆ సత్యాలను స్వీకరించారు. తమ అభినందనలను, కృతజ్ఞతలను తెలిపారు. వేదప్రియులు, వివేకవంతులునైన అరవిందయోగి (పాండిచేరి) గారు ఆనాటికి అందుబాటులో ఉన్న వేదభాష్యాలనన్నిటిని చదివి, వారి అభిప్రాయాలను తాము నడిపే వేదిక్ మేగజైన్‌లో వ్యాసాలుగా ప్రచురించే వారు. అందులో వారు మహర్షి దయానందుని గురించి, వారి వేద భాష్యాన్ని గురించి రెండు వ్యాసాలు వేరువేరుగా ప్రచురించారు. అవి చాలా దూరదృష్టితోను, మార్మికంగాను ఉన్నాయి. చివరగా మహర్షి భాష్యమే ఉత్తమోత్తమైనదని చెబుతూ -

" In the matter of Vedic interpretation I am convinced that whatever may be the final complete interpretation, Dayananda will be honoured as the first discoverer of the right clues. Admist the chaos and obscurity of old ignorance and age long misunderstanding, his was the eye of direct vision that pierced to the truth and fastened on that which was essential. He has found the keys of the doors that time had closed and rest as under the seals of the imprisoned fountain"

Vedic Magazine 1916.

"వేదార్థ భాష్యాలలో చరమ సిద్ధాంతాలేవైనా దయానందుని భాష్యమే" సర్వోత్తమ మార్గదర్శి. సరియైన వేదభాష్యకర్తగా ఆయనను నేను గౌరవిస్తున్నాను. మధ్యకాలంలో వెలువడిన భాష్యాలలో ఎన్నో దోషాలు, పొరబాట్లు చోటు చేసుకున్నాయి. బహు శతాబ్దాలుగా భ్రమ గప్పియున్న వేదాల సత్యస్వరూపాన్ని వారిదృష్టి సమావలోకించినది. దయానందులవారు జ్ఞాన భండారాల కప్పు తొలగించినారు" అని అరవిందయోగి తమ వేదిక్ మేగజైన్ (1916) లో శ్లాఘించారు. ఇంతేగాక, వారు దయానంద మహర్షి వ్యక్తిత్వాన్ని కొనియాడుతూ ఒక పెద్ద వ్యాసమే వ్రాశారు. దానిని ఒక్క వాక్యంలో చెప్పాలంటే-సంస్కర్తలనే విశాలహిమాలయ పర్వత శిఖరాల శ్రేణులలో 'దయానంద' ఎవరెస్టు శిఖరం వంటి" వాడ న్నారు.

అట్టి దయానంద మహర్షి వేదభాష్యాన్ని, సత్యార్థప్రకాశం, ఋగ్వేదాది భాష్యభూమిక, సంస్కారవిధి మొదలైన గ్రంథాల ఆధారంగా ఈ వైదిక దినచర్యను వ్రాయ ప్రయత్నిస్తాను. అట్లే వేదకాలం నాటి మహర్షుల వ్యాఖ్యానాలను, విషయ వివరణలను ఉదహరించే ప్రయత్నం చేస్తాను. దయానంద మహర్షి అనుయాయులైన పం. గురుదత్ విద్యార్థి, పం. యుధిష్ఠర మీమాంసక్, పం. వీరసేన్ వేదశ్రమీ, పం. సత్యవ్రత సిద్ధాంతాలంకార్, పం. గంగాప్రసాద్ ఉపాధ్యాయ మొదలగు ఆర్య విద్వాంసుల గ్రంథాలలో ఉదహరించిన మంచి భావాలను స్వీకరిస్తూ కరపత్రాలు వ్రాయాలని సంకల్పం. అట్లే నేను ఆధునిక విజ్ఞానాభిమానిని కనుక ఆ విజ్ఞాన వేత్తల మాటలలోని సత్యాన్ని, ఋతాన్ని (ప్రకృతి నియమాలను) సహృదయతతో స్వీకరిస్తాను. పై మహానుభావులదరికి నా కృతజ్ఞతల నర్పిస్తున్నాను.

ఒక విషయంపై ఉపన్యసించటం చాలా తేలిక. అదే విషయాన్ని పుస్తకంగా కరపత్రంగా వ్రాయటం చాలా కష్టం. ఎట్లో నేను శ్రమించి వ్రాస్తున్నాను. నా చేతి వ్రాతను గుర్తించి శ్రీ గంగాధర్ అర్యగారు ముద్రాణాలయ ప్రతిగా (ఫెయిర్ కాపీగా) వ్రాస్తున్నారు. శ్రీ డి. నర్సయ, శ్రీ గంగాధర్ గార్లు శ్రమించి 2,3 సార్లు ప్రూఫ్‌లు చూస్తున్నారు. చివరి ప్రూఫ్ నేను చూసి కొన్ని సరిచేసి ముద్రణకిస్తున్నాము. మా సీతాఫల్‌మండి ఆర్యసమాజ కార్యవర్గం సహృదయతతో వ్యయాన్ని ఆమోదించి వితరణ చేస్తున్నది. విక్రాంత్ ప్రింట్ హౌస్ శ్రీ దీన దయాళ్ గారు సహనంతో సహకరిస్తున్నారు. పాఠకులు ప్రోత్సాహిస్తున్నారు. వీరందరికి నా హృదయ పూర్వక ధన్యవాదములు. శుభాకాంక్షలు. విజ్ఞులు ఇందేవైనా దోషాలున్న తెలుపగోరుచున్నాను.

మీ సేవలో

**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)



# ప్రకాశకీయము

మా ఆర్యసమాజము సీతాఫల్‌మండి సికింద్రాబాదు వారి చతుర్థప్రచురణ "వైదిక సుప్రభాతము". మా ప్రథమ, ద్వితీయ తృతీయ ప్రచురణలైన "శాన్తిసూక్తం", "వేదాలలో మనోవిజ్ఞానము – మానసిక చికిత్స" మరియు "లక్ష్మీసూక్తం"లకు పాఠకులనుండి వచ్చిన విశేష ఆదరణయే మమ్ము ఈ పుస్తక ప్రచురణకు ప్రేరేపించినది.

నేడు జనులు దైవాన్ని మేలుకొల్పుటకై వివిధ శ్లోకాలు పఠించు చున్నారు. ఈ మేలుకొలుపు శ్లోకాలనే సుప్రభాతమంటున్నారు. ఉదాహరణకు రామాయణంలోని "కౌసల్యా సుప్రజా రామా పూర్వా సంధ్యా ప్రవర్తతే" అనుశ్లోకాన్ని పఠిస్తూ వెంకటేశ్వర స్వామిని మేలుకొల్పుచున్నారు. వీటిలోని లోపాలను చక్కగా గ్రంథకర్త సుమ్నార్థి డా. కోడూరి సుబ్బారావు గారు ఈ పుస్తకంలో విశదీకరించారు. మనము నిద్ర కుపక్రమించేముందు శివసంకల్ప (శయన కాల) మంత్రాలు పఠించి పరమేశ్వరుని ప్రార్థిస్తాము. అట్లే నిద్రనుండి లేవగానే పడకపై కూర్చుండి ప్రాతఃస్మరణ వేదమంత్రాలతో పరమేశ్వరుని మన హృదయంలోనికి ఆహ్వానిస్తాము, ప్రార్థిస్తాము. అనగా పరమేశ్వర స్తుతి ప్రార్థనలతో దినము ప్రారంభిస్తాము. ఈ ప్రాతఃస్మరణ వేదమంత్రాలు అర్థసహితంగ పఠించినచో ఎక్కువ ఫలితముంటుందని ఈ పుస్తకాన్ని ప్రచురించు చున్నాము. పూర్వపు పుస్తకములవలెనే, ప్రచారార్థము ఈ పుస్తకాన్ని కూడా ఉచితంగా వితరణ చేయుచున్నాము.

గ్రంథకర్త పుస్తక నిర్మాణానికై వేదమంత్రాలతో బాటు ఇతర గ్రంథాలనుండి శ్లోకాలను సేకరించి విషయాన్ని విశ్లేషించారు. నిక్షిప్త వేదవాఙ్మయాన్ని, సాధారణ జనులకు వైజ్ఞానికంగా సులభశైలలో అందీయటమే వారి తపన. వారు పలురచనలు ఈ దిశలో చేసినారు, చేయుచున్నారు. మేము ప్రతి నెల ప్రచురించే కరపత్రాలు కూడా వీరి రచనలే. మా కరపత్రాలకు లభించే విశేష ఆదరాభిమానాలు వీరికే చెందుతాయి. ఆరోగ్యం అనుకూలించకున్నను తమ రచనలతో సమాజసేవ చేయుచున్న గ్రంథకర్త సుమ్నార్థి గారికి పరమేశ్వరుడు పూర్ణాయువును ప్రసాదించుగాక!

ముద్రణ దోషాలను సవరించిన మా ఉపకార్యదర్శి శ్రీ డి. గంగాధర్ గారికి, సకాలానికి చక్కగా ముద్రించి ఇచ్చిన విక్రాంత్ ప్రింట్ హౌస్ వారికి మా ధన్యవాదాలు.

**ఓం తత్సత్!**

భవదీయుడు,

**డి. నర్సయ్య**

కార్యదర్శి

ఆర్యసమాజము– సీతాఫల్‌మండి, సికింద్రాబాద్ – 61.

# మహర్షి డా. కోడూరి సుబ్బారావు గారి ఇతర రచనలు

| క్రమం | పుస్తకం పేరు | ధర |
|---|---|---|
| 1 | గాయత్రీ విజ్ఞానం | 50.00 |
| 2 | గాయత్రీ మహిమ | 30.00 |
| 3 | మన ఇతిహాసం | 70.00 |
| 4 | మన వేదశాస్త్రాల పరిచయం | 50.00 |
| 5 | జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరియసీ | 60.00 |
| 6 | అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం | 60.00 |
| 7 | అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ | 20.00 |
| 8 | అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము | 30.00 |
| 9 | గోమాత | 30.00 |
| 10 | వేదాలలో సూర్యకిరణ చికిత్స | 40.00 |
| 11 | వేదాలలో జల చికిత్సా విజ్ఞానము | 20.00 |
| 12 | పెండ్లినాటి ప్రమాణాలు | 40.00 |
| 13 | గర్భాధాన విజ్ఞానము | 30.00 |
| 14 | దౌహృదిని (ఋషుల దృష్టిలో గర్భిణీ స్త్రీ) | 30.00 |
| 15 | మరణానంతరం జీవుని ప్రయాణం | 40.00 |
| 16 | మానవ ధర్మము | 25.00 |
| 17 | వేదాలలో అశ్వనీ దేవతలు | 20.00 |
| 18 | సంధ్యావందనము-వైజ్ఞానిక సమాలోచనము | 20.00 |
| 19 | అగ్నిహోత్ర వైజ్ఞానిక స్వరూపము | 15.00 |
| 20 | వైదిక క్రాంతిపథం | 15.00 |
| 21 | వేదాల వెలుగుచూపే ఆర్యసమాజం | 20.00 |
| 22 | పురుష సూక్తము (వైజ్ఞానిక వ్యాఖ్య) | 20.00 |
| 23 | సరస్వతీ సూక్తము | 10.00 |
| 24 | ఐతరేయోపనిషత్తులోని సృష్టికథ | 10.00 |
| 25 | చతుర్దశ భువనములు | 10.00 |
| 26 | వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమం | 10.00 |
| 27 | గంగాధర శివుడు | 5.00 |
| 28 | ఈశావాస్య మిదం సర్వం (వైజ్ఞానిక వ్యాఖ్య) | 35.00 |
| 29 | వైదిక శాంతిపాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) | 20.00 |
| 30 | ప్రణవ స్తోత్రము (అర్థ సహితం) | 10.00 |
| 31 | మహర్షి దయానందుడు | 10.00 |
| 32 | దైనిక అగ్నిహోత్రవిధి | 4.00 |
| 33 | శివరాత్రి రహస్యము | 3.00 |
| 34 | పండుగల పరమార్థం | 40.00 |
| 35 | వేదాలలో వర్షేష్టి విజ్ఞానం | 25.00 |



# వైదిక సుప్రభాతం

ఓం విశ్వాని దేవి సవితర్ దురితాని పరాసువ ।
యద్ భద్రం తత్+నః + ఆ సువ ॥

ఓ సవితా! సృష్టికర్తవైన పరమేశ్వరా! ఓ సర్వంతర్యామీ! మాలోని దుర్గుణాలను, దుష్టభావాలను అడ్డంకులను, అసత్యాలను దూరంచేసి యద్ భద్రం - ఏవి భద్రములైనవో, కళ్యాణకరమైనవో, ఏవి నీదరికి చేర్చునవియో వాటిని మాకు ప్రసాదింపుము. మానవమాత్రులందరికీ, ప్రాణిమాత్రులందరికీ ప్రసాదింపుము.

**ఓ3మ్ శాంతి శ్శాంతి శ్శాంతిః**

'సుప్రభాతం' అంటే శుభప్రదమైన ఉషోదయం. అందరికి శుభాలను సుఖాలను ప్రసాదించేది పరమేశ్వరుడే కనుక అతని సేవలో, అతని ఆజ్ఞానువర్తులమై జీవితాన్ని గడుపుతామని గట్టిగా సంకల్పించుకోవటమే సరియైన సుప్రభాతం. మన పూర్వులు ఆ విధంగా చేశారు. కాని మధ్యకాలంలో వేదధర్మ ప్రచారం లోపించటం వల్లా, దేశాన్ని సరియైన మార్గంలో నడిపే ధర్మాత్ములైన రాజులు లేకపోవటంవల్లా, దేశం చిన్నాభిన్నమై స్వతంత్రరాజ్యాలు రాజ్యమేలాయి. ఏకచ్ఛత్రాధిపత్యం, అఖండత, ఐకమత్యం లోపించాయి. కొందరు విదేశీయులు దోపిడీ దొంగలై దోచుకోగా, కొందరు స్వతంత్ర రాజులకు పరస్పర ద్వేషాలు రెచ్చగొట్టి వారి పబ్బం గడుపుకున్నారు. చివరికి దేశం విదేశీయుల పాలనలోనికి వెళ్లిపోయింది. అట్లే వైదికధర్మం స్వార్థపరుల స్వార్థానికి గురియై అనేక సంప్రదాయాలు పుట్టగొడుగులుగా పుట్టుకొచ్చాయి. దానితో సుప్రభాతాలు కూడా చాలానే పుట్టుకొచ్చాయి.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతంతో ప్రారంభమైన ఈ సుప్రభాతాల పరంపర క్రమంగా అన్నిరకాల దేవీదేవతలకు రచింపబడ్డాయి. ఈమధ్య బాబాలకు, గురువులకు, గాంధీగారి వంటి మహాపురుషులకు కూడా సుప్రభాతాలు వ్రాసి ప్రసారం చేస్తున్నారట. ఇక ముందు గంగ, యమున, గోదావరి, కృష్ణా వంటి నదులకుకూడా సుప్రభాతాలు వ్రాస్తారేమో తెలియదు. ఈ సుప్రభాతాలతో దేవుళ్లను మేల్కొల్పుతారు. "మేలుకొని మమ్మేలుకో" మని ప్రార్థిస్తారు. దానితో దేవీదేవతల అనుగ్రహం తమపై వర్షిస్తుందని నమ్ముతారు. దీనిని మూఢనమ్మకమనాలో పిచ్చినమ్మకమనాలో,

తెలియటంలేదు. సృష్టికర్తయైన ఏకేశ్వరుడు వేదాల ద్వారా ఏమి ఉపదేశించాడో, ఉషోదయకాలంలో ఏమి చేయ్యాలని ఆదేశించాడో దానిని ఉపదేశించేవారు కరువయ్యారు. వినేవారు కూడ తక్కువౌవుతున్నారు. ఏమంటే సమయం లేదంటున్నారు. మాకు చాల బరువు బాధ్యత లున్నాయంటున్నారు. మరి వినోదాలలో, విందులలో, వింతలలో గడపటానికి ఈ మహానుభావులకు సమయ మెక్కడనుండి వస్తున్నదో తెలియదు.

శ్రీ వేంకటేశ్వర సుప్రభాతంలోని మొదటి శ్లోకం వాల్మీకి మహర్షి వ్రాసిన రామాయణంలోనిది. విశ్వామిత్ర మహర్షి దశరథ మహారాజును అనునయింపజేసి, తన యాగ సంరక్షణార్థం రామలక్ష్మణులను తనవెంట తీసుకువెడతాడు. రామలక్ష్మణులు ధనస్సులను, రెండేసి అంబుల పొదులను ధరించి సూర్యతేజస్సుతో విశ్వామిత్ర మహర్షి వెనక నడుస్తూ 1½ యోజనములు అడవిలో కాలినడకన సరయూనది సమీపానికి చేరుకున్నారు. అప్పటికి సాయం సంధ్యాసమయ మయ్యింది. అలవాటులేని నడక ప్రయాణం కనుక రామలక్ష్మణులు బాగా అలసిపోయారు. అది గమనించిన విశ్వామిత్ర మహర్షి ఆ రాత్రి అక్కడనే విశ్రమిద్దామని చెప్పారు. ముగ్గురూ స్నానం చేసి సంధ్యా ప్రార్థనోపాసనలు చేసుకున్నారు. మహర్షి వారిద్దరికి ఆకలిదప్పులు స్మరణకు రాకుండా 'బల, అతిబల' అనే విద్యలను ఉపదేశించాడు. బహుశ ఈ విద్యలు ఒక రకమైన ప్రాణాయామ విద్యలు కావచ్చు. విశ్వామిత్ర మహర్షి రామలక్ష్మణులకు గడ్డిని పరచి శయ్యలుగా తయారుచేసి పరుండమని చెప్పి, తానును వారి ప్రక్కన శయనించాడు.

మరునాడు బ్రహ్మీముహూర్తంలోనే మహర్షి నిద్రలేచి సంధ్యోపాసన చేసుకున్నాడు. ఉషఃప్రభ వచ్చుచున్నది. అలసి నిద్రించియున్న రామలక్ష్మణులు ఇరువురు ఇంకా నిద్రలేవలేదు. అప్పుడు మహర్షి ఈ క్రింది విధంగా వారిని నిద్రలేపాడు.

**శ్లో॥ కౌసల్యా సుప్రజా రామా పూర్వా సంధ్యా ప్రవర్తతే ।**
**ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్ ॥**

"కౌసల్య దేవికి ఉత్తమ సంతానమైన ఓ రామా! తూర్పున ఉషస్సులు ఉదయించాయి. ఉదయ దైవకార్యాలైన సంధ్యాగ్నిహోత్రాలు చేసుకోవాలి కదా!

నీవింక నిదురలెమ్ము" అంటూ సౌమ్యంగా నిద్రలేపాడు. అప్పుడు రామలక్ష్మణులు-

శ్లో॥ తస్యర్షేః పరమోదారం వచః శ్రుత్వా నృపాత్మజౌ ।
స్నాత్వా కృతోదకౌ వీరౌ జపేతుః పరమం జపమ్ ॥

మహర్షి మాటలు విన్న ఆ వీర రాకుమారులు సరయూనదిలో స్నానంచేసి సంధ్యావందనం చేసుకున్నారు. పరమ పవిత్ర మంత్రమైన గాయత్రిని వారిరువురు కొంతసేపు జపించారు.

శ్లో॥ కృతాహ్నికౌ మహావీర్యౌ విశ్వామిత్రం తపోధనమ్ ।
అభివా ద్యాభిసంహృష్టౌ గమనా యాభి తస్థతుః ॥

- గీతా ప్రెస్ వారి వాల్మీకి రామాయణం (బాలకాండ 23-2,3,4)

అనంతరం మహాపరాక్రమవంతులైన ఆ రామలక్ష్మణులు సంధ్యాగ్నిహోత్రాది ప్రాతః దైవకార్యాలను ముగించుకొని తపోధనులైన విశ్వామిత్ర మహర్షికి అభివాదం చేశారు. సాష్టాంగ నమస్కారం చేశారు.

పై శ్లోకాలలోని మొదటి శ్లోకాన్ని శ్రీ వేంకటేశ్వర సుప్రభాతంలోని మొదటి శ్లోకంగా తీసుకొని అనంతరం వారి పౌరాణిక వేంకటేశ్వరుని పొగడ్తలతో ముంచెత్తారు. ఆ స్తోత్రాలలో కొన్ని అపశృతులు కూడా చోటు చేసుకున్నాయి. ఉదాహరణకు-

1. కాంతా కుచాంబురుహ కుట్మల లోల దృష్టి ...........
2. కమాలా కుచ చూచుక కుంకమతో నియతారుణితాతుల నీలతనో .....
3. సప్రేమ భీతి కమలాకర పల్లవాభ్యాం సంవాహనేఽపి....

(వీటి తెలుగు అర్థాలు వ్రాయ నా మనసొప్పుట లేదు. సంస్కృత పండితుల నెవరినైన అడిగి తెలుసుకోండి).

అయినా ఏక పత్నీవ్రతుడు, అన్ని విషయాలలో మర్యాదను అతిక్రమించని శ్రీరాముడెక్కడ? ఇట్టి కాముక పౌరాణిక దేవుడెక్కడ? అందుచేతనే మన మహర్షులు దేవుని గురించి తెలుసుకోగోరే జిజ్ఞాసువులు శ్రుతి వాక్యాలతోనే - వేద వాక్యాలతోనే తెలుసుకోవాలని "శ్రోతవ్యః శ్రుతి వాక్యేభ్యః" అని నియమ మేర్పరచినారు. ఇక

మనం ఉపోద్ఘాతాన్ని యింతటితో ఆపి నిద్రలేవగానే ఏ దేవుని స్మరించాలో, వేదం ఏమి చెబుతున్నదో తెలుసుకుందాం.

**ప్రాతః స్మరణ మంత్రాలు - కొన్ని ముఖ్య విషయాలు :** వేదమంత్రాలకు ఋషి, దేవత, ఛందస్సు, స్వరము అని నాలుగు విషయాలుంటాయి. ఈ క్రింద వ్రాయబోయే మంత్రాలు ఋగ్వేద సప్తమ మండలంలోని 41వ సూక్తానికి చెందినవి. ఈ మంత్రాలన్నిటికి **వశిష్ఠుడు ఋషి.** ఈ వశిష్ఠుడు రామాయణ కాలం నాటి వశిష్ఠుడు కాదు. స్వాయంభువ మన్వంతరంలోని మొదటి చతుర్యుగంయొక్క మొదటి కృతయుగానికి చెందినవాడు. ఈయన స్వయంగా ఈ మంత్రాలను రచించలేదు. సృష్టికర్త ముందుగా ఈ మంత్రాలను 'అగ్ని' అనే పేరుగల ఆదిఋషి హృదయంలో ప్రకాశపరచాడు. వారి నుండి 'బ్రహ్మ' అనే పేరుగల ఋషి నేర్చుకొని తనలో ధారణచేసుకున్నాడు. ఆయన ఒక గురుకులాన్ని ఏర్పాటు చేసుకొని తన వద్దకు వచ్చిన శిష్యులకు ఋగ్వేదాన్ని నేర్పాడు. ఆ శిష్యులు దూరదూరంగా గురుకులాల నేర్పరుచుకొన్నారు. ఈ మంత్రాలద్రష్టయైన ఋషి వశిష్ఠుడు ఆ శిష్యకోటిలోనివాడే. ఆయన వ్యాకరణం ద్వారా వేదమంత్రాల అర్థం తెలుసు కోవటమేగాక, యోగాభ్యాసం చేస్తూ అంతర్ముఖుడై ఆత్మపరమాత్మల సాక్షాత్కారం పొందాడు. తాను ఈ మంత్రాల అర్థం తెలుసుకోగోరుతూ సమాధి స్థితిలోనికి వెళ్లి అంతర్యామియైన సృష్టికర్తనుండి వీటి సరియైన అర్థాలను తెలుసుకున్నాడు. ఆ అర్థాలను తన శిష్యులకు, సామాన్యప్రజలకు వివరించి చెప్పాడు. కనుక ఆనాటి నుండి తరతరాలు ఆ ఋషికి కృతజ్ఞతలు తెలుపుకోవటానికి ఈ సూక్తాన్ని పఠించేటప్పుడు ఆ ఋషిపేరు చెప్పుకొని ఆరంభించటం అనాదిగా వస్తున్న ఆచారం. కనుకనే ముందుగా ఆ ఋషిపేరు చెప్పుకోవటం జరిగింది. 'వస–నివాసే' అనే మూల ధాతువు నుండి 'వశిష్ఠ' పదం పుట్టింది. కనుక దీని మూలార్థం (Root meaning) వసింపచేసేవాడు, ఆశ్రయమిచ్చేవాడు. ఈ పేరు మన పిల్లలకు కూడా పెట్టుకోవచ్చు.

వేదమంత్రాలకు ఋషినామంతో బాటు దేవతలను, ఛందస్సులను, స్వరాలను కూడా వేదపాఠీయులు చెప్పుకుంటారు. ఇక్కడ దేవతలంటే – ఆ యా మంత్రాలలో ఏ ఏ పదార్థాల గురించి లేదా ఏ ఏ విషయాల గురించి చెప్పబడిందో వాటిని దేవతగా వ్యవహరిస్తారు. ఈ ప్రాతఃస్మరణ మంత్రాలలో అగ్ని, ఇంద్రుడు,

మిత్రావరుణులు, అశ్వినులు, భగుడు మొదలైన చాలమంది దేవతలుండటంవల్ల అంటే-ఏకేశ్వరునికే అనేక పేర్లుండటంవల్ల **'అగ్న్యాదయో లింగోక్తా దేవతా'** అని చెప్పబడింది. ఈ సూక్తంలో ఈ పేర్లన్నిటితో సర్వవ్యాపక సర్వేశ్వరుని మన హృదయంలోనికి ఆహ్వానిస్తున్నాము. ఒక్కొక్క పేరు ఆ ఏకేశ్వరుని ఒక్కొక్క గుణాన్ని, శక్తి సామర్థ్యాలను సూచిస్తాయి.

వేద మంత్రాలకు ముఖ్యంగా సప్తఛందస్సులుంటాయి. 1) గాయత్రీ 2) ఉష్ణిక్, 3) అనుష్టుప్, 4) బృహతీ, 5) పంక్తీ, 6) త్రిష్టుప్, 7) జగతీ. వీటిలో కూడా మరికొన్ని ఉపభాగాలుంటాయి. ఈ ప్రాతఃస్మరణ మంత్రాలకు వేరు వేరు ఛందస్సులున్నాయి.

అట్లే వేదస్వరాలును సప్త విధాలుగా ఉంటాయి. "షడ్జ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, దైవత, నిషాద్" అని సప్తస్వరాలు. వీటి నుండే సంగీత శాస్త్రంలోని "స,రి,గ,మ,ప,ద,ని,స" లు వచ్చాయట. ఈ మంత్రాలకును స్వరాలు వేరువేరుగా ఉన్నాయి. మనం సస్వర వేదపాఠీయులం కాదు కనుక యింత మాత్రం తెలుసుకొంటే సరిపోతుంది. వివరంగా తెలుసుకోగోరేవారు వేద సంహితలను చూడగోరు చున్నాము. ఆ యా దేవతలను గురించిన విషయాలను మంత్ర వివరణ భాగంలో సంక్షిప్తంగా తెలుసుకుందాము.

## ప్రాతః స్మరణ సూక్తమ్ - భగసూక్తమ్

లోకంలో ప్రాతఃస్మరణ సూక్తం 'భగసూక్తం'గా ప్రసిద్ధిని పొందింది. వేదపాఠీయులంతా దీనిని 'అథ భగసూక్తమ్' అంటూ ప్రారంభిస్తారు. ఎందుకంటే ఈ సూక్తంలో పలుమార్లు భగ పదం వస్తుంది. 'భగః' అంటే ఐశ్వర్యము, సంపదలు అని అర్థం. ఈ సూక్తంలో దేవుని అనేక నామాలతో స్మరించినా, ఆహ్వానించినా ఐశ్వర్యం కొరకే ప్రార్థించబడింది. కనుక ఈ మంత్రాల దేవత 'భగః' అని కూడా అనవచ్చు. అందుచేతనే ఇది భగసూక్తం అని ప్రాచుర్యం పొందింది.

ఈ భగసూక్తం ఋగ్వేదంలోని సప్తమ మండలంలో 41వ సూక్తంగాను, అథర్వవేదంలోని తృతీయకాండంలో 16వ సూక్తంగాను ప్రత్యేక సూక్తాలుగా ఉన్నాయి.

యజుర్వేదంలో మాత్రం 34వ అధ్యాయంలో 34వ మంత్రం నుండి 40వ మంత్రం వరకు ఉన్నాయి. మరి, వేటిని భగ(ఐశ్వర్యం) అనాలి అంటే-

శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః ।
జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణ ॥

సమగ్ర ఐశ్వర్యం(రాజ్యాధిపత్యం), పరాక్రమం, కీర్తి, వివిధ సంపదలు ఆత్మ పరమాత్మల విషయక జ్ఞానం, వైరాగ్యం (భౌతిక సంపదలపై విరక్తి, భగవంతునిపై అనురక్తి) అనే ఆరింటిని 'భగము' అనవచ్చునని ఒక పండితుడన్నాడు. మరొక పండితులవారు -

శ్లో॥ ఉత్పత్తి వినాశం చ, భూతానా మాగతమ్ గతమ్ ।
వేత్తి విద్యాం చావిద్యాం చ, స వై భగవాన్ ఇతి స్మృతః ॥

సృష్టి యొక్క ఉత్పత్తి వినాశాలను, ప్రాణుల(జీవుల) రాక పోకలను, విద్య అవిద్యలను చక్కగా తెలుసుకున్న సాధు మహాత్ములను భగవాన్ అంటారన్నారు. భగవాన్ అంటే భగాన్ని (ఐశ్వర్యాన్ని) కలవాడని అర్థం కనుక పై సంపదలలో ఏ సంపదను కలిగిఉన్నా, వారిని భగవాన్ అనవచ్చు. అట్లే ఆధ్యాత్మిక జ్ఞానం కలిగిన వారినీ, వైరాగ్యసంపన్నులను కూడా 'భగవాన్' అని సంబోధించవచ్చు. ఈ సూక్తంలో సృష్టికర్తయు, సర్వవ్యాపక సర్వేశ్వరుడును, సృష్టిలోని సమస్త ఐశ్వర్యాలను కలిగినవాడును అగుటచే పరమేశ్వరుని 'భగ ఏవ భగవానస్తు దేవాః' అని కీర్తింప బడింది. కనుకనే మనం సృష్టికర్తను 'భగవంతుడు' అంటాము.

## 'వైదిక సుప్రభాతం' ఎప్పుడు పఠించాలి?

మహర్షులు దీనిని నిద్రలేవగానే శయ్యపైననే నిటారుగా కూర్చొని హృదయ స్థానంలో మనస్సును నిలిపి మనస్సులోనే దీనిని పఠించాలన్నారు. ఆ విధంగా మనస్సు నిలువకుంటే ప్రక్కవారికి యిబ్బంది లేకుండా మందస్వరంతో పఠించవచ్చు. దీనిని అర్థభావనతో పఠిస్తేనే మనఃశాంతి, ఆత్మతృప్తి కలుగుతాయి. లేకుంటే పెద్దగా ఫలితం ఉండదు.

ఆయుర్వేద శాస్త్రం మూడవ ఝాము ప్రారంభంకాగానే (తెల్లవారు ఝామున 3 గంటలకే) నిద్రలేవాలంటుంది. సాయంత్రం 7 గంటలకే భోజనం చేసి 9 గంటలకు నిద్రిస్తేనే ఇది సాధ్యం అవుతుంది. ఎక్కువలో ఎక్కువ 10 గంటలకు నిద్రించి 4 గంటలకు నిద్రలేవాలి. అప్పుడు శరీరం మనస్సు సేదదీరి స్ఫూర్తిని పొంది ఉంటాయి. దానినే మహర్షులు బ్రాహ్మీముహూర్తమన్నారు. అప్పుడు జప ధ్యానాదులు చేసుకోవడానికి చాలా అనుకూలంగా ఉంటుంది. ధ్యానానంతరం కొద్ది సేపు వ్యాయామం ప్రాణాయామం చేసుకొని స్నానం చెయ్యవచ్చు. సంధ్యాగ్నిహోత్రాలు చేసుకోవచ్చు.

ప్రియపాఠకులారా! మనమంతా ఆత్మస్వరూపులం. జీవాత్మలం. మన పరిమాణం పరమాణువంత. ఈ శరీరంలో మన హృదయ ప్రాంతంలో ఉంటాం. మన మనస్సు, బుద్ధి కూడా మనవద్దనే ఉంటాయి. సృష్టికర్తయైన దేవుడు సర్వవ్యాపకుడు కనుక అతడు మన దేహేంద్రియ మనోబుద్ధులలోనూ, జీవాత్మలలోనూకూడా వ్యాపించి ఉన్నాడు. కనుక మనం మనలోనికి అంతర్ముఖులమై మనలో వ్యాపించి ఉన్న అంతర్యామిని నిద్రలేవగానే ఈ క్రింది మంత్రాలతో ప్రార్థన చేసుకోవాలి.

## అథ ప్రాతః స్మరణమ్

ఓ3మ్........... ఓ3మ్................. ఓ3మ్=హే సర్వ సంరక్షక అంతర్యామీ!

**1. ఓం ప్రాతరగ్నిం ప్రాతరిన్ద్రం హవామహే**
**ప్రాతర్మిత్రా వరుణా ప్రాతరశ్వినా ।**
**ప్రాతర్భగం పూషణం బ్రహ్మణస్పతిం**
**ప్రాతః సోమ ముత రుద్రం హువేమ ॥**

– ఋగ్వేదం (7-41-4), యజు. (34-34), అథర్వ (3-16-1)

**వాక్యార్థం :** <u>ప్రాతః + అగ్నిం ప్రాతః + ఇంద్రం హవామహే</u> = ఓ అంతర్యామీ!

ఈ ప్రభాత ప్రశాంత సమయాన నీ అగ్ని తత్త్వాన్ని - జ్ఞాన ప్రకాశాన్నీ, నీ ఇంద్ర శక్తినీ - ఐశ్వర్య శక్తినీ మాలోనికి ఆహ్వానించు చున్నాము.

ప్రాతః + మిత్రా వరుణా ప్రాతః + అశ్వినా = ఈ ప్రాతః కాలమున పరమ మిత్రుడు, శ్రేష్ఠశాసకుడు, లోకాలోకశక్తులు కలవాడు అయిన పరమేశ్వరుని మాలోనికి ఆహ్వానించు చున్నాము.

ప్రాతః + భగం పూషణం బ్రహ్మణస్పతిం = ఈ ప్రభాత సమయాన భజనీయుడు (సేవింప దగినవాడు), బ్రహ్మాండ పోషకుడు, వేదజ్ఞాన ప్రదాత అయిన సృష్టికర్తను మాలోనికి ఆహ్వానించుచున్నాము.

ప్రాతః + సోమమ్ + ఉతరుద్రమ్ హువేమ = ఈ ప్రభాత ప్రశాంత సమయాన సోముని సౌమ్యంగా సత్పురుషులకు ప్రేరణ కలిగించువానిని, రుద్రుని, దుష్టులకు తగిన దుఃఖములను కలిగించువానిని మాలోనికి ఆహ్వానించు చున్నాము.

సరళార్థం : ఓ అంతర్యామీ! ఈ ప్రభాత ప్రశాంత సమయాన నీ జ్ఞాన ప్రకాశాన్ని, నీ ఐశ్వర్యశక్తిని మాలోనికి ఆహ్వానించుచున్నాము. ఈ ప్రాతఃకాలాన మాకు పరమమిత్రుడవు, శ్రేష్ఠశాసకుడవు, లోకాలోకాలు (సృష్టి ప్రలయాలు) చేయగల అశ్వినీశక్తులు గల నిన్ను మాలోనికి సాదరంగా ఆహ్వానించు చున్నాము. భజనీయుడవు, బ్రహ్మాండ పోషకుడవు, వేదజ్ఞాన ప్రదాతవు అయిన నిన్ను స్వాగతించు చున్నాము. నీవు సత్పురుషులకు సౌమ్యుడవు. దుష్టులకు రుద్రుడవు. నీలో సహనము మన్యువు అనంతంగా ఉన్నాయి. అట్టి దివ్యగుణయుక్త పరమేశ్వరా! నీకు మా సాదర స్వాగతం.

వైదిక ఆధ్యాత్మిక వివరణ : (ముఖ్య గమనిక) : పై మంత్రంలోని అగ్ని, ఇంద్ర, మిత్రావరుణా, అశ్వినా మొదలైన పదములన్నీ ఇది ఆధ్యాత్మిక ప్రకరణం (దైవ ప్రార్థన విషయం) కావటం వల్ల ఏకేశ్వరునికే వర్తిస్తాయి. వేరే విషయాలు వచ్చినప్పుడు- స్వస్తి వాచన, శాంతికరణ మంత్రాలలో ఆ ప్రకరణాలకు చెందిన అర్థాలను తెలుసుకుందాము. ఇక్కడ కేవలం ఆధ్యాత్మిక అర్థాలను గురించి మాత్రమే వివరించు చున్నాము. వేదం ఏమంటుందంటే-

**" ఇంద్రం మిత్రం వరుణ మగ్నిం మాహురథో దివ్య స్ససుపర్ణో గరుత్మాన్ ।**
**ఏకం సద్విప్రా బహుధా వదన్తి అగ్నిం యమం మాతరిశ్వాన మాహుః ॥**

– ఋగ్వేదం (1–164–46)

వేదంలో ఇంద్రుడు, మిత్రుడు, వరుణుడు, అగ్ని, దేవుడు, సుపర్ణుడు, గరుత్మంతుడు మొదలైన నామములతో సంబోధింప బడే పరమేశ్వరుడు ఒకే ఒక్కడు. విప్రులు (జ్ఞానులు) ఆ ఏకేశ్వరునే అగ్ని అనీ, యముడనీ మాతరిశ్వుడనీ ఆయా సందర్భాలలో పేర్కొంటారు" అంటుంది. వీరంతా వేరు వేరు దేవుళ్ళను కుంటారేమోనని మరొక చోట-

**న ద్వితీయో న తృతీయశ్చతుర్థో నా ప్యుచ్యతే......**
**......య ఏతం దేవ మేక వృతం వేద ॥**

- అథర్వవేదం (13-14, 16-18)

సృష్టి స్థితి లయ కర్త ఒకే ఒక్కడు. ఇద్దరు గాని, ముగ్గురుగాని.... లేనేలేరు. అతడు ఒకే ఒక్కడు అంటుంది వేదం. కనుక ఈ మంత్రంలోని పదములన్నిటికి ఏకేశ్వరుని పరంగానే అర్థాలు వ్రాయబడ్డాయి.

1. <u>అగ్ని</u> (అ ఇఞ్చు గతి పూజనయోః) - అగ్ని అంటే 'గతి కలిగినది, పూజించ తగినది' అని అర్థం. ఇక్కడ గతి అంటే కేవలం కదలిక, వేగం అని అర్థంకాదు "గతిస్త్రయోఽర్థాః జ్ఞానం, గమనం, ప్రాప్తిశ్చేతి పూజనం నామ సత్కారః. యోఽఞ్చతి అచ్యతే ఽ గత్యంగత్యేతి వా సోయమగ్నిః" అని నిర్వచనం. అంటే జ్ఞాన పూర్వకమైన గమనంతో లక్ష్యం వైపు పయనించి ప్రాప్తించవలసిన దానిని ప్రాప్తించటాన్ని గతి అంటారని ఋషులు వివరించారు.

అట్లే పూజనం అంటే గుళ్లలో పూజించినట్లుకాదు. తగిన విధంగా సత్కరించటం. దేవుడు వేదం ద్వారా బోధించిన ఉపదేశాలను పాటించటం. ఆజ్ఞాపాలనం. తల్లి దండ్రులను పూజించటమంటే - శ్రీరామునివలె వారి మనస్సు నొప్పింపక ఆచరించటమే కదా!

**'స్వాభావకీ యస్య జ్ఞాన బలక్రియా చ'** అని చెప్పినట్లు సృష్టికర్త బల క్రియలు పరిపూర్ణములు. అతడే పూజింపదగినవాడు. కనుక ఇచట 'అగ్ని' పదం సర్వంతర్యామికే వర్తిస్తుంది.

2. <u>ఇంద్రుడు</u> : "ఇది-పరమైశ్వర్యే" అనే మూల ధాతువుతో ఇంద్ర పదము నిర్మించబడుతుంది. **"య ఇన్దతి పరమైశ్వర్యవాన్ భవతి స ఇంద్రః పరమేశ్వరః"** అని నిర్వచనం. అంటే-సృష్టిలోని సమస్త ఐశ్వార్యాలకు అధిపతి, జీవుల కర్మలనుబట్టి వారికి తగిన భోగ భాగ్యాలనిస్తూ ఉంటాడు కనుక ఏకేశ్వరునకే ఇంద్రుడని మరొక పేరు.

3. <u>మిత్రుడు</u> : (ఞి మిదాస్నేహనే) – **"మేద్యతి స్నిహ్యతి స్నిహ్యతే వా స మిత్రః"** అని నిర్వచనం. అందరితో స్నేహం చేస్తూ అందరిచే ప్రేమింప బడతాడు కనుక ఏకేశ్వరునికి మిత్రుడని మరొక నామము.

4. <u>వరుణుడు</u> : (వృఞ్ – వరణే, వర–ఈప్సాయామ్) **"యః సర్వాన్ శిష్టాన్ ముముక్షూన్ ధర్మాత్మనో వృణోత్యథవా యః శిష్టైర్ముముక్షుభిర్ ధర్మాత్మ భిర్ ప్రియతే వర్యతే వా స వరుణః పరమేశ్వరః"** అని నిర్వచనం. అంటే-శిష్టులగు (యోగ్యులగు) యోగ సాధకులను, విద్వాంసులను, ముక్తిని కోరువారిని, ముక్తాత్మలను, ధర్మాత్ములను స్వీకరించువాడును; అట్టి వారిచే వరింపబడే వాడును కావటం చేత సృష్టికర్తకు వరుణుడని మరొకపేరు. **"అథవా వరుణోనామ వరః శ్రేష్ఠః"** – లేక సృష్టికర్త అందరికంటే శ్రేష్ఠుడు కనుక అతనిని వరుణు డనవచ్చును.

5. <u>అశ్వినౌ</u> : పదము వేదాలలో అశ్వినా గా ప్రయోగింపబడింది. (అశూఙ్-వ్యాప్తౌ) వ్యాపకగుణం కలిగి ఉండే రెండు జంట శక్తులను 'అశ్వినౌ–అశ్వినా' అని ద్వివచనంలో చెబుతారు. ఆ యా సందర్భాలను బట్టి ఆ జంటశక్తులు అనేక రకాలుగా ఉంటాయి. వైద్యులపరంగా చెబితే "Physician and surgeon" మందులు ఇచ్చేవాడు, శస్త్రచికిత్సకుడు అని అర్థం. ఇక్కడ దేవునిపరంగా చెప్పుకోవాలి కదా! అందుచే సృష్టి ప్రలయాలు రెంటినీ చేయగల ఏకేశ్వరుడని అర్థం. వీటిని కొందరు లోకాలోక శక్తులని కూడా అంటారు. అశ్వినీ దేవతలను గురించిన మరెన్నో విషయాలు నా రచన "వేదాలలో అశ్వినీ దేవతలు" చూడండి.

6. <u>భగుడు</u> : (భజ సేవాయామ్) **"భగః – సకలైశ్వర్యం, సేవనం వా విద్యతే యస్య**

స భగవాన్" అని నిర్వచనం. సకలైశ్వర్యాలకు అతడు స్వామి కనుకను అందరిచే సేవింప తగినవాడు కనుకను అతనిని మనం తరచుగా 'హే భగవాన్' 'ఓ భగవంతుడా!' అని స్మరించుకుంటాం.

7. <u>పూషణుడు</u> (పూష-పుష్టౌ) సృష్టిలోని పదార్థాలన్నటి లోపలా బయట (వెలుపల) వ్యాపించి వాటికి పుష్టిని (శక్తి సామర్థ్యాలను) కలిగిస్తాడు. కనుక సృష్టికర్తకు పూషణుడని మరొకపేరు.

8. <u>బ్రహ్మణస్పతి</u> : (బృహ, బృహి-వృద్ధౌ) పెద్దది, గొప్పది అయినది బ్రహ్మ ఔతుంది. సృష్టికర్త అన్నిటిని తనలో ఏకపాదంగా కలిగి ఉన్నాడు కనుక అతడు బ్రహ్మ. బ్రహ్మాండ నాయకుడు. అట్లే లోకంలోని వివిధ జ్ఞానాలలో వేదమే గొప్పది కనుకనూ, అన్ని సత్యజ్ఞానాలు దానినుండే వచ్చినవి కనుకనూ వేదాలను కూడా 'బ్రహ్మ' అంటారు. అట్టి వేదాలను ఇచ్చిన వాడు కనుక అతడు 'బ్రహ్మణస్పతి' కూడా అయ్యాడు.

9. <u>సోముడు</u> : (షుఞ్-అభిషవే, షూ-ప్రేరణే, షు-ప్రసవైశ్వర్యే అనే మూడు ధాతువులకు 'మన్' ప్రత్యయం చేర్చి సోమః పదం నిర్మించవచ్చు. కనుక 3 రకాలుగా అర్థాలు చెప్పవచ్చు.

1. బ్రహ్మాండాలను అందలి ప్రాణులను ఉత్పన్నం చేస్తాడు కనుక సృష్టికర్తకు సోముడని పేరు.
2. ఎవరు అంతర్యామిని ఉపాసిస్తారో వారికి అతడు సత్కర్మలయందు, ధర్మమునందు ప్రేరణ కలిగిస్తాడు కనుక అతడు సోముడు.
3. ఉపాసకులకు ఆనందాన్ని, ఐశ్వర్యాలను ప్రసాదిస్తాడు కనుక పరమేశ్వరునకు సోముడని మరియొక పేరు.

10. <u>రుద్రుడు</u> : (రుదిర్ - అశ్రుమోచనే) దుష్టులకు కాలాంతరంలో కష్టాలను కలిగించి వారిని రోదింపచేస్తాడు - ఏడిపిస్తాడు కనుక సర్వంతర్యామికే రుద్రుడని మరొక పేరు.

ఈ ఒక్క మంత్రంలోనే ఏకేశ్వరుని 10 పేర్లను తెలుసుకున్నాము కదా! అట్లే అతనికి 100కు పైగా పేర్లు వేదాలలో కనబడతాయి. వాటిని గురించి మహర్షి

దయానందుల వారు రచించిన జగత్ప్రసిద్ధ గ్రంథం 'సత్యార్థప్రకాశం' మొదటి సముల్లాసం (అధ్యాయం)లో చూడండి. మరికొన్ని కొత్త నామములను రాబోవు మంత్రాలలో తెలుసుకుందాము.

ఈ మంత్రంలోని 'మిత్రావరుణా' పదమునకు "అశ్వినా" పదమునకు ప్రాణాపాన వాయువులనీ, ఆచార్య ఉపదేశకులనీ, మాతాపితలనీ కూడా అర్థాలు చెప్పవచ్చు. సంక్షిప్తంగా ఆంగ్లంలో మంత్రార్థం ఈ విధంగా ఉంటుంది.

We invoke God at dawn, we pray for progress at dawn, we practice breath control at dawn, we respect father and mother at dawn. At dawn we invoke God, the Lord of the Vedas, the sustainer of All, and Adorable by all. We use medicinal herbs in the morning and at dawn, we try to realise the true nature of soul.

**2. ఓం ప్రాత ర్జితం భగముగ్రం హువేమ**
**వయం పుత్ర మదితేర్ యో విధర్తా ।**
**ఆధ్రశ్చిద్యం మన్యమాన స్తురశ్చిద్**
**రాజాచిద్యం భగం భక్షీత్యాహ ॥**

<u>వాక్యార్థం</u> :

<u>**ప్రాతః+జితం భగమ్+ఉగ్రం హువేమ**</u> = ఈ ప్రభాత సమయాన జయశీలుడు, సర్వైశ్వర్యకర్త దుష్టులయెడ ఉగ్రుడైన సర్వంతర్యామిని మా హృదయంలోనికి సాదరంగా ఆహ్వానిస్తున్నాము.

<u>**వయం పుత్రమ్ + అదితేః + యః + విధర్తా**</u> = అదితి యొక్క పుత్రుని (ఆకాశముయొక్క పుత్రుని వలె భాసించు సూర్యుని) ఎవరు చక్కగా ధరించి యున్నారో ఆ సర్వాధారుని మాలోనికి ఆహ్వానించుచున్నాము.

<u>**ఆధ్రః + చిద్యం మన్యమానః + తురః + చిత్**</u> = సర్వవిధాల ధారణచేయ తగినవాడు, మాననీయుడు శీఘ్రకారి యైన పరమాత్మను ఆహ్వానించు చున్నాము.

<u>రాజాచిత్+యమ్ భగమ్ భక్షి + ఇతి+ఆహ</u> = ఎవడు విశ్వప్రకాశకుడో ఐశ్వర్య ప్రదాతయో అట్టి దేవుని మేము కీర్తింతుముగాక! ఇతరులకు ఉపదేశింతుము గాక!

<u>సరళార్థం</u> : ఈ ప్రభాత ప్రశాంత సమయాన సదా జయశీలుడు, సర్వైశ్వర్యకర్త దుష్టులయెడ ఉగ్రుడు, ఆకాశ పుత్రునివలె భాసించు సూర్యుని ధరించువాడు అయిన సర్వాంతర్యామిని మాలోనికి సాదరంగా ఆహ్వానించు చున్నాము. సర్వ విధాల ధారణ చేయతగినవాడు, మాననీయుడు, శీఘ్రకారి, విశ్వప్రకాశకుడు ఐశ్వర్యప్రదాత అయిన దేవదేవుని మాత్రమే మేము ఉపాసింతుము గాక! ఆ దేవుని యథార్థ స్వరూపాన్నే ఇతరులకు ఉపదేశింతుము గాక!

<u>వివరణ</u> : ఈ మంత్రంలో మరికొన్ని క్రొత్త పదములు వచ్చాయి. వాటిని తెలుసుకుందాము.

<u>జితం</u> : దేవుడు సదా జయశీలుడు. ఒకచోట సృష్టికర్త ఏమన్నాడంటే -

"అహమిన్ద్రో న పరాజిగ్య ఇద్ధనం న మృత్యవే஽వ తస్థే కదాచన

(ఋ 10-48-5).

ఓ మానవులారా! నేనెప్పుడూ పరాజయాన్ని పొందలేదు. ఒక్కసారి కూడా ఓడిపోలేదు. మృత్యువుకానీ, అపజయంకానీ నాకెప్పుడూ కలుగవు" అన్నాడు. కనుక అతడిని ఏ రాక్షసుడు ఒక్కసారి కూడా జయించలేదు.

<u>ఉగ్రమ్</u> : దుష్టులయెడ అతడు ఉగ్రుడు. రాక్షసులపాలిట రుద్రుడు.

<u>అదితిః</u> = దీని మూలార్థం "రెండుగా ఖండింప నలవికానిది"అని. నాశ రహితమైనదని భావం. అట్టివి చాలా ఉన్నాయి. వాటిని వేదం ఈ విధంగా వివరిస్తుంది -

**అదితిః ద్యౌరదితి రన్తరిక్ష మదితి ర్మాతా స పితా స పుత్రః ।**
**విశ్వేదేవా అదితిః పంచజనా అదితి ర్జాత మదితిర్ జనిత్వమ్ ॥**

- (ఋ. 1-89-10).

ద్యు అంతరిక్షలోకాలు, మాతా పిత పుత్రులు, సమస్త ప్రాకృతిక దేవతలు,

విద్యా దేవతలు, పంచ జనులు (పంచ జ్ఞానేంద్రియాలు) వీటినన్నిటిని అదితు లనవచ్చును. ఎందుచేతనంటే సృష్టి నశించే దైనప్పటికీ ప్రవాహరూపంలో అనాది. అంటే మరల మరల ఈ విధంగానే సృష్టి జరుగుతూ ఉంటుంది. ఉత్పన్నమైనవి, ఉత్పన్నం కాబోయేవి కూడా అదితులే-నాశరహితములే" అంటుంది. కనుక ఇక్కడ అదితి పుత్రుడంటే ఆకాశపుత్రుని వలె భాసించే సూర్యుడని అర్థం చెప్పబడింది. ఇట్లే వేదాలలో అదితి పదము కనబడినపుడు ఆ ప్రకరణానికి (సందర్భానికి) తగిన విధంగా అర్థం చెప్పుకోవాలని మహర్షి దయానందులవారన్నారు.

"ఆకాశంలోని సమస్త గోళాలను ధరించి నియమించి భ్రమణం చేయించే సర్వవ్యాపక సర్వాధార పరమాత్మనే మనం ఉపాసించాలి కాని, ఒక ఆకారంతో సీమిత పరిమాణంగల ఏకదేశీయుని ఉపాసించకూడదు. అట్టి దేవీదేవతలను వర్ణిస్తూ ఇతరులకు ఉపదేశించకూడదు" అని ఈ మంత్రం బోధిస్తున్నది. శ్రీ దేవీచంద్ గారు ఆంగ్లంలో ఈ విధంగా అర్థం వ్రాశారు.

At dawn we invoke the victorious Mighty Bhaga, God the only object of adoration, the creator of the sun which is situated in the atmosphere and the upholder and sustainer of all, the knower of all beings, the Imperial ruler, the chastiser of evil doers. He admonishes us to worship Him so we invoke alone.

**3. ఓం భగ ప్రణేతర్ భగ సత్యరాధో**
**భగేమాం ధియ ముద వాదదన్నః ।**
**భగ ప్రణో జనయ గోభి రశ్వైర్**
**భగ ప్రనృభిర్ నృవంతః స్యామ ॥**

<u>వాక్యార్థం :</u>

<u>భగ ప్రణేతః భగ సత్యరాధః</u> = హే భగవాన్! పరమైశ్వర్యశాలీ! మమ్ము ఐశ్వర్యవంతుల మగుటకు ప్రేరేపింపుము. ఓ సత్యరాధా! సత్యధనీ! మమ్ము చక్కని సత్యమార్గమున నడుచుటకు ప్రేరేపింపుము.

<u>భగ + ఇమామ్ ధియమ్ ఉత్ + అవ + దదత్ + నః</u> = మా బుద్ధులను ధర్మధనమును పొంద ప్రేరేపించి మమ్ము రక్షింపుము.

<u>భగ ప్రనః + జనయ గోభిః + అశ్వైః</u>= ఓ భగా! ఐశ్వర్య ప్రదాత! మాకు కేవలం ధనధాన్యములనే గాక గోసంపదను, అశ్వసంపదను కూడా ప్రసాదింపుము.

<u>భగః ప్రనృభిః నృవన్తః స్యామ</u> = నీ కృపవలన మేము ఉత్తమ సంతానము కలవారము, ఉత్తమ నాయకులు గలవారము అగుదుముగాక!

<u>సరళార్థము :</u> హే భగవాన్! పరమైశ్వర్యశాలీ! మమ్ము ఐశ్వర్యవంతుల మగుటకు ప్రేరేపింపుము. మా బుద్ధులలో వసించి ధర్మమార్గాన ధనవంతులమగుటకు మమ్ము ప్రేరేపింపుము. పుణ్య కార్యాలను చేయ ప్రేరేపింపుము. కేవలం ధన ధాన్య సంపదలనేగాక, గో అశ్వాది సంపదలను, ఉత్తమ సంతాన సంపదను కూడా పొంద ప్రేరేపింపుము. నీ కృపవలన మేము ఉత్తమ నాయకులు గలవారమై, మేమును ఉత్తమ నాయకుల మగుదుము గాక!

<u>వివరణ</u> : ఐశ్వర్యం అంటే కేవలం రూపాయలే (కరెన్సియే) కాదు. గో అశ్వ సంతానాదులు కూడా సంపదలే. గోవు పదము పాడి పశువులన్నిటికీ ప్రతీక. అశ్వ పదము అన్నిరకాల ప్రయాణ సాధనాలకు ప్రతీక. జన పదము సుసంతానమునకు, సన్మిత్రులకు, అక్కరకు ఆదుకొనే బంధువర్గానికి ప్రతీక. ఇవి లేకుంటే ఎంత డబ్బు ఉన్నా పెద్ద ప్రయోజన ముండదు.

ధనం అవసరమేకానీ అది ధర్మమార్గాన (సుపథాన) లభించినది కావాలి. మన యోగ్యతను మించి ఆశించటంకూడా మంచిదికాదు. ఆదిశంకరులు చెప్పినట్లు-

**"యల్లభసే నిజకర్మోపాత్తం విత్తం తేన వినోదయ చిత్తం॥"**

మన కష్టార్జితంగా లభించిన ధనంతో సంతృప్తిని చెందాలి. సంతృప్తిని మించిన సౌభాగ్యం లేదంటారు పెద్దలు. ఎంత ఉన్నా సంతృప్తిలేక పోతే సుఖం ఉండదు. పిసినారితనం ఉంటే ధనమున్నా దరిద్రుడౌతాడు. సంపాదించిన దానిలో కొంతైనా ధర్మకార్యాలకు వినియోగించకపోతే అభ్యుదయ నిఃశ్రేయసాలు రెండింటిని కోల్పోతాడు. కనుక ఈ మంత్రంలో అంతర్యామిని **"భగేమామ్ ధియ ముదవా**

**దదన్నః"** అని ప్రార్థించాము "ఓ ఐశ్వర్య ప్రదాత! ఓ సర్వంతర్యామీ! మాకు ఉన్నతి కలుగునట్లు మా బుద్ధులను ప్రేరేపింపు" మని వేడుకున్నాము.

దయానంద మహర్షి దీనికి భావార్థం వ్రాస్తూ – "మానవులు భగవంతుని ప్రార్థించేటప్పుడూ, విద్వాంసులను సేవించేటప్పుడూ మాకు సదా సద్బుద్ధిని, సజ్జన సాంగత్యాన్ని ప్రసాదించుడని కోరుకోవా"లాన్నారు.

O Bhaga; (God, the only object of adoration) Thou art the leader of all beings and O Bhaga; (God, the only object of adoration) Thou art Lord of all eternal substances, please confer on us the supreme wisdom and shield us form danger. O Bhaga; (God, the only object of adoration) please augment our earthly possession by bestowing on us kine and horses and O Bhaga; (God the only object of adoration) let us become rich in men and heroes.

4. **ఓం ఉతేదానీం భగవంతః స్యామ**
   **ఉత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్ ।**
   **ఉతోదితా మఘవన్ త్సూర్యస్య**
   **వయం దేవానాం సుమతౌ స్యామ ॥**

**వాక్యార్థం :**

**ఉత + ఇదానీమ్ భగవంతః స్యామ** = హే భగవాన్! ఈ ప్రాతః సమయంలో మేమును భగవంతుల మగుదుము గాక! ఐశ్వర్యవంతుల మగుదుము గాక! దైవీసంపదను పొందుదుము గాక!

**ఉత ప్రపిత్వే + ఉత మధ్యే అహ్నామ్** = పూర్వాహ్నము, మధ్యాహ్నము, అపరాహ్నములలో కూడా దైవీసంపదలను పొందుదుము గాక!

**ఉత + ఉదితా మఘవన్ + తు + సూర్యస్య** = హే మఘవన్! ఉత్తమ ధనయుక్త పరమేశ్వరా! ఈ సూర్యోదయ సమయాన.....

వయం దేవానాం సుమతౌ స్యామ = విద్వాంసుల, సాధుమహాత్ముల, సుమతుల అంటే సత్సంగాల గడిపి విద్యాజ్ఞానాదులను పొందుదుము గాక! నూతనోత్సాహమును పొందెదము గాక!

సరళార్థం : హే మఘవన్! సకలైశ్వర్య ప్రదాతా! మేము ఈ ప్రభాత ప్రశాంత ఉపాసనా కాలంలోనూ, పూర్వాహ్న, మధ్యాహ్న, అపరాహ్నకాలాల్లోనూ రోజంతా దైవీసంపదతో వర్ధిల్లునట్లు అనుగ్రహింపుము. ఉదయించే సూర్యుని చూస్తూ మేమును ఉన్నతిని పొందుదుము గాక! దేవతల సుమతులలో- దివ్యగుణయుక్తులైన సాధుమహాత్ముల సత్సంగాలలో గడుపుదుము గాక! అట్టివారు ఆ సమయమున లభించకున్న మహర్షుల గ్రంథాల స్వాధ్యాయంలో గడుపుదుము గాక!

వివరణ : ఈ మంత్రాలలో క్రొత్తగా భగవంతుని 'మఘవన్'! పేరుతో సంబోధించబడింది. 'మఘమ్' అంటే కూడా ధనమనియే అర్థం. ధనం కలవారిని 'మఘవన్' 'మఘవాన్' అనవచ్చు. పరమేశ్వరుడు ధనవంతులందరికన్న గొప్పధనవంతుడు కనుక అతడు శ్రేష్ఠమఘవన్. "నిధీనాం నిధిపతిం హవామహే" అంటుంది యజుర్వేదం(23-19).

యాస్కమహర్షి వేదపదములకు చక్కటి నిఘంటుకోశాన్ని, నిరుక్తాన్ని రచించి తరతరాలకు గొప్ప మేలుచేశారు. వేదార్థాన్ని తెలుసు కోవాలంటే వాటిని అధ్యయనం చెయ్యక తప్పదు. మధ్యకాలంలో మరుగున పడిపోయిన వాటిని మహర్షి దయానందుల వారు పునరుద్ధరించారు. 'వేదాంగ ప్రకాశ్' అనే పేరుతో ఒక బృహత్ గ్రంథం కూడా వ్రాశారు. ఆర్షసాహిత్య మండలి-అజ్మీర్ వారు దానిని 14 భాగాలుగా ప్రచురించారు. అందులోని ఒక భాగమైన నిఘంటువును మన తెలుగువారికి మేలుచేయ కీ.శే. శ్రీ ఆరమండ్ల వెంకయ్య ఆర్యగారు అనువదించి ప్రచురించారు. అట్టి నిఘంటువులో ధనానికి పర్యాయపదాలుగా 28 పేర్లు పేర్కొన బడ్డాయి.

1. మఘమ్, 2. రేక్ణః, 3. రిక్థమ్, 4. వేదః, 5. వరివః, 6. శ్వాత్రమ్, 7. రత్నమ్, 8. రయిః, 9. క్షత్రమ్, 10, భగః, 11. మీళ్హా + మీళ్హమ్, 12.గయః, 13. నృమ్ణమ్, 14. ద్యుమ్నమ్, 15. తనా, 16. బంధుః, 17. ఇన్ద్రియమ్,

18. వసు, 19. రాయః, 20. రాధః, 21. భోజనమ్, 22. మేధా, 23. యశః, 24. బ్రహ్మ, 25. ద్రవిణమ్-శవః, 26. శ్రవః, 27. వృత్రమ్ (ఋతమ్, విత్తమ్- అని పురాణాలలో), 28. వృతమ్. ఇతి ధన నామః. అంటే-వేదాలలో ధనం గురించి 28 రకాల పదములు ప్రయోగింప బడ్డాయి. వీటి వివరాలు నిరుక్తశాస్త్రంలో ఉంటాయి.

ధనం ఎంత అవసరమో ఈ మంత్రం ఎంత చక్కగా వివరించిందో చూడండి. దినంలో ప్రాతః పూర్వాహ్న మధ్యాహ్న అపరాహ్నలలోనూ, దినమంతా ధనం అవసరమే నంటున్నది. అందుకనే "ధనం లేనిది క్షణం గడవ"దంటారు పెద్దలు. ముందుగా మనిషి స్వయం పోషకుడు కావాలి. పరాన్నబుక్ కాకూడదు. అందుచేతనే వేదం పలుచోట్ల సోమరితనాన్ని నిరసిస్తుంది. **'అకర్మణ్యా దస్యుః'** - సోమరి దస్యుడు - దుష్టు డవుతాడని కూడా అంటుంది. తస్మాత్ జాగ్రత్త.

మను మహర్షి ఎంత చక్కటి నీతి చెప్పారో చూడండి -

శ్లో॥ **బ్రహ్మే ముహూర్తే బుధ్యేత ధర్మార్థౌ చానుచిన్తయేత్ ।**
**కాయక్లేశాంశ్చ తన్మూలాన్ వేదతత్త్వార్థమేవ చ ॥**
(మనుస్మృతి. 4-92)

బ్రహ్మీ ముహూర్తంలో (సుమారు 4 గంటలకు) నిద్రలేచి ముందుగా దైవప్రార్థన, ఆత్మ పరమాత్మల చింతన, ఉపాసన మొదలైన ధర్మకార్యాలు ఆచరించాలి. అనంతరం తన ఆర్థిక పరిస్థితి ఏమిటి? తన అవసరాలు ఏమిటి? కొంతైనా దాన ధర్మాలకు వినియోగించి పుణ్యం సంపాదించు కోవాలి కదా! లేకుంటే మరుజన్మ మంచిజన్మ ఎలా వస్తుంది? అని ఆలోచించాలి. అనంతరం శరీర పరిస్థితి ఏమిటి? ఏ ఆహార పానీయ ఔషధాలు అవసరం? ఏ వ్యాయామ ప్రాణాయామాలు అవసరం అనేదికూడా దృష్టిలో పెట్టు కోవాలి. వీటన్నిటికీ వేదం పరిష్కార మార్గాలు సూచిస్తుంది. కనుక వేద స్వాధ్యాయం, వేద తత్త్వార్థ చింతన కూడా చేయాలంటారు మనుమహర్షి అస్తు-మనం అట్లే చేద్దాం.

O Noble pure God, may prosperity be ours at present, in future

and during the day time! May we, O Bounteous Lord, at the rising of the sun, be happy, in the wake of excellent wisdom of the learned.

5. ఓం భగ ఏవ భగవానస్తు దేవా
స్తేన వయం భగవంతః స్యామ ।
తం త్వా భగ సర్వ ఇజ్జోహవీతి
స నో భగ పుర ఏతా భవేహ ॥

– ఋగ్వేదం (7-14-1 to 5)

వాక్యార్థం :

భగః + ఏవ భగవాన్ + అస్తు దేవాః = హే భగవాన్! సకల ఐశ్వర్యయుక్త పరమేశ్వరా! నీ కృపవలన మేమును దివ్యగుణాలతో దేవతల మగుదుము గాక!

తేన వయం భగవంతః స్యామ = నిన్ను ఉపాసించటంవల్లా, నీ ఆజ్ఞాపాలన చేయటంవల్లా మేమును ఐశ్వర్యవంతుల మగుదుము గాక!

తమ్ + త్వా భగ సర్వః + ఇత్ + జోహవీతి = నీవు భగవంతుడవు (సకలైశ్వర్య ప్రదాతవు) కనుకనే సర్వజనులు నిన్ను స్తుతిస్తారు. ప్రార్థిస్తారు. అగ్నిలో ఆహుతులిస్తారు.

సః + నః + భగ పుర ఏతా భవ + ఇహ = అట్టి నీవే మాకు మార్గదర్శకుడవై మమ్ము నడిపింపుము.

సరళార్థం : హే భగవాన్! సకలైశ్వర్యయుక్త పరమేశ్వరా! నీ కృపవలన మేమును దివ్యగుణాలతో దేవతలమగుదుము గాక! నిన్నుపాసించుటవల్ల మేమును సంపన్నుల మగుదుము గాక! నీవు భగవంతుడవు – సకలైశ్వర్య ప్రదాతవు కనుకనే జనులంతా నిన్నే స్తుతిస్తారు. ప్రార్థిస్తారు. అగ్నిహోత్రంలో ఆహుతులిస్తారు. అట్టి నీవే మాకు మార్గదర్శకుడవై మమ్ము సుపథాన నడిపింపుము. ఐశ్వర్యవంతులను, దివ్యగుణ సంపన్నులను చేయుము.

వివరణ : సృష్టి కర్తయైన దేవుడే సర్వైశ్వర్యకర్త, ఐశ్వర్య ప్రదాత కూడా. అందుకనే ఈ మంత్రం **"భగ ఏవ భగవాన్ అస్తు**– నీవే ఐశ్వర్య స్వరూపుడవై ఉన్నావు" అంటున్నది.

అయితే, ఆ భగవంతుని ప్రార్థించినవారంతా ఐశ్వర్యవంతులు కాలేక పోతున్నారు కదా! దేవునికి పక్షపాతమా? పక్షపాతం చూపేవాడు దేవుడెట్లవుతాడు? దానికి వేదం చెప్పే సమాధానం ఏమంటే– **"ఐశ్వర్యం పురుషార్థంవల్లా, పుణ్యకర్మలవల్లా వస్తుందేకాని కేవలం ప్రార్థనవల్ల కాదు"** అంటుంది.

**"అక్షైర్ మా దీవ్యః కృషిమిత్ కృషస్వ**
**విత్తేరమస్వ బహు మన్యమానః"** – ఋగ్వేదం (10–34–13)

"ఓ మానవులారా! మీరు సోమరులై పాచికలాడవద్దు. లాటరీలలో, షేరుమార్కెట్లలో, పందాలలో లక్షలు కోట్లు గడించాలని ఆశించవద్దు. వ్యవసాయదారులవలె కష్టించి అనంతరం ప్రార్థించండి" అంటుంది. పూర్వ జన్మలలో చేసిన పుణ్యకర్మల వలననే భాగ్యవంతుల యింట పుడుతున్నారంటుంది.

ప్రారంభంలో చెప్పుకున్నట్లుగా 'భగం' అంటే కేవలం ధన కనక వస్తు వాహనాలే కాదు. దైవీ గుణాలు కూడా సంపదలే. కర్మయోగియైన మన శ్రీకృష్ణుడు ఏవేవి దైవీసంపదలో చక్కగా వివరించి చెప్పాడు.

**శ్లో॥ అభయం సత్త్వ సంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః ।**
**దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయః + తప ఆర్జవమ్ ॥**

తా॥ నిర్భయత్వం, అంతఃకరణశుద్ధి, తాను జీవాత్మనే కాని శరీరం కాదు అనే జ్ఞానయోగంలో స్థిరంగా ఉండటం, సాత్త్విక దానం, ఇంద్రియ నిగ్రహం పంచమహాయజ్ఞాలు చెయ్యటం, వేద స్వాధ్యాయం, నిజాయితీగా జీవించటం, ఇంకా...

**శ్లో॥ అహింసా సత్య మక్రోధః + త్యాగః శాంతి రపైశునమ్ ।**
**దయా భూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీ రచాపలమ్ ॥**

తా॥ మనో వాక్కాయలతో అకారణంగా ఎవరినీ హింసించకపోవటం, సత్యంపలకటం, ఎవరిపైనా వైరభావం (ద్వేషభావం) లేకుండటం, వీలైనంత ఎక్కువగా త్యాగం చెయ్యటం, శాంతంగా ఉండటం, అపైశునమ్ (ఎవరినీ నిందించకుండటం),

త్రోటి ప్రాణులపై దయ కలిగి ఉండటం, చెడు పనులు చేయటానికి సిగ్గుపడటం, కాలాన్ని వ్యర్థంగా గడపక సద్వినియోగం చెయ్యటం. ఇంకా .....

**శ్లో॥ తేజః క్షమా ధృతిః శౌచమ్ అద్రోహో నాతిమానితా ।**
**భవంతి సంపదం దైవీమ్ అభిజాతస్య భారత ॥**

– భగవద్గీత (16-1 to 3)

ఓ భరతశ్రేష్ఠా ! అర్జునా! పై వాటితోబాటు బ్రహ్మచర్యతేజస్సు, క్షమ, ధైర్యం, పరిశుభ్రత, ఎవరికీ ద్రోహం చెయ్యకపోవటం, గర్విష్ఠి కాకుండటం మొదలైన గుణాలన్నీ దైవీసంపదలు. ఇవి మనకు ఇహ పర సుఖశాంతులను కలిగిస్తాయి. అంతేగాక, సంస్కారరూపంలో ఇవి మనవెంట మరుజన్మలో కూడా వస్తాయి" అంటాడు. ఇంతేకాక. **"దైవీ సంపద్ + విమోక్షాయ నిబంధాయ + అసురీ మతా"** (భగవద్గీత 16-5)" ఈ దైవీసంపదలే మిమ్ము సమస్త దుఃఖాలనుండి విడిపిస్తాయి. వీటికి వ్యతిరేకమైనవన్నీ అసురీసంపదలు. అవన్నీ త్రివిధ దుఃఖాలతో కూడిన ఈ సంసార చక్రంలో బంధిస్తాయి" అంటాడు. కనుక అంతర్యామిని ఉపాసిస్తూ దైవీసంపదలను పొంద యత్నించాలి. అప్పుడే మనం "తేన వయం భగవంతః స్యామ"=నిన్ను ఉపాసించి మేమును నీవంటి వారము అగుదుము గాక! అనుకోవాలి.

O learned person, God verily is supreme. May we become supreme through Him. O God, all invoke Thee. O supreme God, be Thou our leader in this world.

ఈ భగసూక్తంలో మొత్తం 7 మంత్రాలున్నాయి. వాటిలో నుండి పైన చెప్పిన 5 మంత్రాలతో నిద్రలేవగానే ప్రార్థన చేసుకుంటే సరిపోతుందని మహర్షి దయానందుల వారన్నారు. మిగిలిన రెండు మంత్రాలలో ఉషస్సుల విశేషత, మహిమలు తెలుపబడ్డాయి. ఉషస్సులంటే – సంధ్యా సమయంలో సూర్యోదయానికి ముందు వచ్చే వెలుగు. ఇది చాలా ఆరోగ్యకరమైనది. ఆ సమయంలో ఊరిబయట విహరిస్తే, భ్రమణం (నడక) చేస్తే చాలా లాభాలు కలుగుతాయని వేదం చెబుతుంది. ఆ లాభాలు వివరించటానికి కొన్ని ఉషః సూక్తాలు కూడా ఉన్నాయి. సందర్భం వచ్చింది

కనుక ఆ రెండు మంత్రాలను కూడా సంక్షిప్తంగా తెలుసుకుందాము.

ఓం సమధ్వరాయోషసో నమన్త
దధిక్రావేవ శుచయే పదాయ ।
అర్వాచీనం వసువిదం భగం నో
రథమివాశ్వా వాజిన ఆ వహన్తు ॥

- ఋగ్వేదం ( 7-41-6)

వాక్యార్థం :

సమ్ + అధ్వరాయ ఉషసః నమన్త = ప్రభాత ఉషస్సులు సత్త్వ గుణయుక్తములు. అప్పుడు ప్రాణులన్నీ నమ్రములుగా-హింసాభావ రహితంగా ఉంటాయి. సత్త్వ గుణంతో ఉంటాయి.

దధి క్రావేవ శుచయే పదాయ = అవి వేగవంతమైన అశ్వాలవలె ఉంటాయి.

అర్వాచీనమ్ + వసు + విదమ్ భగం నః = అవి మాకు పెక్కు ప్రాకృతిక సంపదలిచ్చునవి అగునుగాక!

రథమివ + అశ్వాః వాజిన ఆ వహన్తు = వేగవంతమైన అశ్వాలు రథాన్ని వేగంగా తీసుకుపోవునట్లు అవి మమ్ము మా లక్ష్యాలను చేర్చునుగాక!

సరళార్థం = ప్రభాత ఉషస్సులు వేగవంతమైన గుఱ్ఱాల వంటివి. అవి నమ్రములై మన అందరకు అనుకూలంగా ఉంటాయి. మన రమణీయ జీవన రథాన్ని మన లక్ష్యం వైపు వేగంగా తీసుకు వెడతాయి.

Dawns like a disciplined horse, incline us to acquire a pure, desirable non-voilent conduct. As strong steeds draw a chariot, may they remind us the presence of the Mighty God, the Lord of riches.

ఓం అశ్వావతీ ర్గోమతీర్న ఉషాసో వీరవతీః
సదముచ్ఛన్తు భద్రాః ।
ఘృతం దుహాన విశ్వతః ప్రపీతా యూయం
పాత స్వస్తిభిః సదానః ॥

- ఋగ్వేదం (7-41-7)

వాక్యార్థం : ఇది మహిళా మణులకు ప్రత్యేకంగా ఉపదేశం :

అశ్వావతీః గోమతీః + నః వీరవతీః = ఓ విదుషీ మహిళలారా! ఏ విధంగా అశ్వములవలె వ్యాపించు ఉషస్సులు కళ్యాణప్రదములో, వీరవంతములో - శక్తిప్రదములో ఆ విధంగా మీరుకూడా లోక కళ్యాణకరులుకండు. వీర పుత్రులను కని లోకానికి మేలు చేయండి.

సదమ్ + ఉచ్ఛన్తు భద్రాః = ఉషస్సులవలె మీరు మా సభలను ప్రకాశ పరచండి.

ఘృతమ్ దుహానా విశ్వతః ప్రపీతా = ఘృతమును పూర్ణపరచుచు అన్ని విధాల మమ్ము తృప్తి పరచండి.

మహర్షి దయానందుల వారు ఈ మంత్రంలోని ఘృత పదమునకు 'శుద్ధం ప్రదీప్త ముదకమ్-ఘృత మిత్యుదకనామ నిఘంటువు (1-12)" అని వ్రాశారు. అప్పుడు ఈ వాక్యం 'శుద్ధ జలాన్ని' అనియును అర్థం చెప్పుకోవచ్చు.

యూయం పాత స్వస్తిభిః సదా నః = మీరు సదా మాకు స్వస్తులను (శుభములను) కలిగించుచు రక్షించండి.

సరళార్థం : ఓ విదుషీ మహిళలారా! ఏ విధంగా అశ్వాలవలె లోకంపై ప్రసరించు ఉషస్సులు కళ్యాణకరములు, శక్తిప్రదములో ఆ విధంగా మీరుకూడ లోక కళ్యాణం చెయ్యండి. మీ విద్యలతో మా సభలను ప్రకాశపరచండి. శుద్ధజలమువలె మమ్ము తృప్తి పరచండి. మీరు మాకు సదా శుభములను కలిగించండి.

వివరణ : ఈ చివరి రెండు మంత్రాలలో ప్రభాత ఉషస్సులు ఆరోగ్యకరములు, సత్త్వ గుణ ప్రేరకములు, ఆనందకరములు, జీవిత లక్ష్యాన్ని ప్రేరేపించేవి అని చెప్పబడింది. వాటిని ఉపమానంగా చెబుతూ ఆ విధంగా విదుషీ మహిళలు లోకానికి మేలు చేయాలని ప్రబోధించబడింది. ఉషస్సుల గురించి తెలుసుకోవలసింది చాలా ఉంది. నా రచన 'వేదాలలో సూర్యకిరణ చికిత్స' లోని ఉషోదయ వైశిష్ట్యం చదవండి.

O learned ladies, just as Dawns, full of nice cold water, and manifold beams, awakeners of heroic persons; auspicious; bestowers of

pure water, advancing magnificiently from all sides, dawn on our assembly, so should ye adorn our assembly and preserve us evermore with your health giving joys.

ఈ రెండు మంత్రాలు ఉషస్సుల గురించినవి కనుక నిద్రలేవగానే ఈ భగసూక్తం లోని మొదటి 5 మంత్రాలతో సృష్టికర్తను స్మరించి ప్రార్థన చేసుకుంటే సరిపోతుంది.

నిద్రలేవగానే "ప్రాతరగ్నిం...." అంటూ దహించే గుణంగల అగ్నిని తలచుకోవటమేమని సందేహించకండి. ఆ మంత్రార్థంలోని 'అగ్ని' పద వివరణ మరొకమారు చదివి ఇది ఆధ్యాత్మిక ప్రకరణం కనుక ఇక్కడ అగ్ని అంటే 'జ్ఞాన ప్రకాశక' అంతర్యామిగా భావిస్తూ స్మరించుకోండి. ప్రాతః స్మరణాన్ని గురించి లోకంలో కొన్ని నమ్మకాలున్నాయి. ఇక మనం వాటిలోని నిజానిజాలను గురించి ఆలోచిద్దాము.

## కొన్ని నమ్మకాలు-నిజానిజాలు

**1. భగసూక్తం - సాయణాచార్యుల వారి అభిప్రాయం :**

శ్రీ సాయణాచార్యుల వారు వేదాంగాలు చదువుకోక పోయినా సామాన్య సంస్కృత జ్ఞానంతో 4 వేదాలకు భాష్యం వ్రాశారు. ఆనాడు లోకంలో వేదాల విషయంలో ప్రజలలో ఉన్న అభిప్రాయాలను, వైదిక కర్మకాండలోని యాజ్ఞిక పశుహింసను సమర్థిస్తూ భాష్యం వ్రాశారు. ఆనాడు వేదాంగాలతో కూడిన వేదాలు చదివిన గట్టి పండితులు లేక పోవుటచే వారి భాష్యమే బహుళ ప్రచారం పొందింది. విదేశీ విద్వాంసులు కూడా దానినే ప్రమాణంగా తీసుకొని ఆంగ్లంలో భాష్యాలు వ్రాశారు. మహర్షి దయానందులవారు శాస్త్రార్థాలతో వారి కళ్ళు తెరిపించేవరకు ఆ పరంపర అట్లే నడిచింది. వారు ఈ భగ సూక్తం ప్రారంభించే ముందు ఈ సూక్త మహాత్మ్యాన్ని ఈ విధంగా కొనియదారు – **"అత్ర కేచిదాహుః నివేష్టుకామో రోగార్తో భగంసూక్తం జపేత్సదా - నివేశం విశతి క్షిప్రం రోగైశ్చ పరిముచ్యతే"**– అంటే ఈ భగసూక్తాన్ని జపిస్తూ ఉంటే కోరికలన్నీ నెరవేరతాయనీ, రోగాలన్నీ విడిపోతాయని భావం. అది ఆనాటి ప్రజల నమ్మకం. కాని, దీనిని అర్థభావనతో జపించి ఆ

రకంగా జీవితాన్ని గడిపితేనే ఆ లాభాలు కలుగుతాయని మనం అర్థం చేసుకోవాలి.

**2. ప్రభాత కరదర్శనం :** నిద్ర లేవగానే భగవంతుణ్ణి స్మరిస్తూ నెమ్మదిగా కండ్లు తెరచి కుడి అరచేతిని చూడాలని ఒక నమ్మకం. ఆ విధంగా చూస్తూ ఈ క్రింది శ్లోకం నెమ్మదిగా పఠించాలంటారు.

**శ్లో॥ కరాగ్రే వసతే లక్ష్మీః, కరమధ్యే సరస్వతీ ।**
**కరపృష్ఠే చ గోవిందః ప్రభాతే కరదర్శనమ్ ॥**

ఈ శ్లోకం ఏవో పురాణాలలోనిది. చేతి మూలంలో లక్ష్మీదేవి, అరచేతి మధ్యలో సరస్వతీదేవి వసిస్తారనీ, చేతులవెనుక గోవిందుడు వసిస్తాడనీ, కనుక కరదర్శనం చెయ్యాలనీ దీని భావం.

లక్ష్మీ సరస్వతులు వేరువేరు మూర్తులు కారు. ఐశ్వర్యానికి లక్ష్మీ, చదువుకు వ్రాతకు సరస్వతి ప్రతీకలు. వాటిని పొందటానికి చేతుల యొక్క సహకారం చాలా అవసరం. సామాన్య జీవితం గడపటానికి కూడా చేతులే ఎక్కువ అవసరం. కనుక ప్రభాత కరదర్శనం చేయటంలో దోషం లేదు. రెక్కాడితేగాని డొక్కాడదని పేదలూ, తాతల ఆస్తులు ఏమీ లేవు; నారెక్కల కష్టంతోనే పిల్లలను పెంచి పెద్దచేసి ఈ కొద్ది పాటి ఆస్తిపాస్తులను సంపాదించుకో గలిగా నని మధ్య తరగతివారు అంటూ ఉంటారుకదా! అయితే కరదర్శనం చేసేటప్పుడు అందుకు తగిన వేదమంత్రాలు పఠించటం ఉత్తమం. వేద మంత్రాలలో ఉన్నంత ప్రేరక భావాలు సామాన్య శ్లోకాలలో ఉండవు. అందుకు ఉదాహరణంగా రెండు మంత్రాలను తెలుసు కుందాము -

**ఓం కృతం మే దక్షిణే హస్తే, జయోమే సవ్య ఆహితః ।**
**గోజిద్ భూయాస మశ్వజిద్ ధనంజయో హిరణ్యజిత్ ॥**

- అథర్వవేదం (7-50-8)

"పురుషార్థం నా కుడి చేతిలో ఉండగా, జయం నా ఎడమచేతికి అందటంలో సందేహ మేముంది? నేను గో సంపదను, అశ్వసంపదను పొందుదును గాక! వివిధ రకాల ధనాలను, కనక రత్న మణిమాణిక్యాది ఆభరణాలను పొందుదును గాక!" అనుకుంటూ కరదర్శనం చెయ్యవచ్చు.

ఈ మంత్రంలోని "గోజిద్" పదము పాడి పశువులన్నిటికి ప్రతీక. 'అశ్వజిత్' పదము వాహనాలన్నిటికి ప్రతీక. ఈ మంత్రం గురించి వ్రాస్తే ఒక పుస్తకమే అవుతుంది. వ్యాకరణ విద్వాంసులైతే ఈ మంత్రంపై గంటల తరబడి వ్యాఖ్యానించగలరు. ఇంత గొప్ప భావం, ప్రేరణ పురాణ శ్లోకంలో ఏముంది?

మరొక వేదమంత్రం.

**ఓం "అయం మే హస్తో భగవాన్ అయం మే భగవత్తరః ।**
**అయం మే విశ్వ భేషజో ఽయం శివాభి మర్శ నః ॥**

- అథర్వవేదం (4-13-6)

నా ఈ హస్తం భగవాన్ - ఐశ్వర్య సంపన్నమైనది. నా రెండవ హస్తం అంతకన్నను గొప్పది. నా ఈ రెండు చేతులు విశ్వభేషజాలు-అన్ని రకాల భౌతిక, సామాజిక, నైతిక ఆధ్యాత్మిక రోగాలన్నిటికీ భేషజాలు. వాటిని పోగొట్టగల శక్తిసంపన్నములు. నా ఈ చేతులు విశ్వకళ్యాణకరములు" అనుకుంటూ కూడా కరదర్శనం చెయ్యవచ్చు.

అయితే, కరదర్శనం చేసేముందు మనకు ఉత్తమోత్తమమైన మానవ దేహాన్నీ, ఎన్నెన్నో కార్యాలను చేయగల చేతులను నిర్మించి యిచ్చిన సృష్టికర్తను స్మరించటమే మన మొదటి కర్తవ్యం. అందుకు ఈ భగసూక్తంలోని మొదటి 5 మంత్రాలు ఎక్కువ అనుకూలం. అనంతరం కరదర్శనం చేస్తూ పై రెండు మంత్రాలతో సంకల్పం చేసుకోవచ్చు.

**3. <u>మహాపురుషుల, గురువుల సంస్మరణ :</u>**

ప్రాతఃస్మరణీయులు మనకు చాలమంది ఉంటారు. జన్మనిచ్చిన తల్లిదండ్రులు, విద్యాబుద్ధులు చెప్పిన గురువులు, మహాత్ములు, మహాపురుషులు, ఆదరించిన బంధుమిత్రులు మొదలగువారు చాలా మంది ఉంటారు. కానీ, ప్రథమస్థానం వీరందరికీ జన్మనిచ్చిన భగవంతునికే యివ్వాలి. కనుక, ఈ భగసూక్త మంత్రాలతో ప్రాతఃస్మరణమ్ చేయటమే సర్వోత్తమం.

**4. ఆది శంకరాచార్యుల వారి అభిప్రాయం :**

వీరు ముందుగా ఆత్మతత్త్వాన్ని స్మరించాలంటారు. ఉదాహరణకు కొన్ని

శ్లోకాలు -

శ్లో॥ ప్రాతః స్మరామి హృది సంస్పుర దాత్మ తత్త్వమ్ ।
సచ్చిత్సుఖం పరమహంస గతిం తురీయమ్ ।
యత్స్వప్న జాగర సుషుప్తి మవైతి నిత్యం ।
తద్బ్రహ్మ నిష్కళమహం న చ భూతసంఘః ॥

శ్లో॥ ప్రాతర్భజామి మనసా వచ సామ గమ్యమ్
వాచో విభాన్తి నిఖిలా యదను గ్రహేణ ।
యన్నేతిన్నేతి వచర్నిగమా అ వోచుః
తం దేవదేవ మజ మచ్యుత మాహురగ్ర్యాః ॥

వీరి ప్రాతఃస్మరణ శ్లోకాలు కొన్ని భాగానే ఉన్నాయి కానీ కొన్ని నవీన అద్వైతానికి కలుపుతూ "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా; జీవో బ్రహ్మైవ నాపరః" అనే భావానికి కలుపుతున్నాయి. అందుకనే మా మిత్రుడు ఒకాయన "అద్వైతం అంటే చెప్పేవానికి, వినేవానికి అర్థం కానిది" అనేవారు. ఈ నవీన వేదాంతాన్ని వేదం అంగీకరించదు. కనుక వేదమంత్రాలద్వారానే పరమాత్మ తత్త్వాన్ని – జీవాత్మ తత్త్వాన్ని స్మరించటం ఉత్తమం.

సృష్టి అంతా 3 తత్త్వాలతోకూడి ఉన్నదని వేదం చాలా స్పష్టంగా చెబుతుంది. అట్టి మంత్రాలు అనేకం ఉన్నాయి. వాటిలో ఒకటి–

ఓం బాలాదేకమ్ + అణీయస్కం + ఉత + ఏకం నేవ దృశ్యతే ।
తతః పరిష్వ జీయసీ దేవతా సా మమ ప్రియా ॥

– అథర్వవేదం (10–8–25)

"సృష్టిలోని ఒకతత్త్వం వెంట్రుక మొనకన్నను సూక్ష్మమైన పరమాణవులతో కూడియున్నది. అదే ప్రకృతి తత్త్వం – సత్వరజ తమస్సులనబడే అత్యంత సూక్ష్మ పరమాణువులు. దానికన్నను సూక్ష్మతత్త్వం మరొకటి ఉన్నది. అది ఎలక్ట్రానిక్ మైక్రొస్కోప్‌కు కూడా కనబడనిది. అదే జీవతత్త్వం. ఆ జీవతత్త్వంకంటె ఇంకను సూక్ష్మమైనది మరొకటున్నది అదే పరమాత్మతత్త్వం. అది అన్నిటిని కౌగలించుకొని

అన్నిటిలోపలా వెలుపలా వ్యాపించి యున్నది". ఆ సర్వవ్యాపక పరమాత్మయే నాకు అత్యంత ప్రియమైనది. అదే నాకు కావాలి" అంటూ ప్రార్థించమంటుంది వేదం. మనం వివేకవంతులమై సృష్టికర్త మాట వినటమే ఉత్తమం.

రామకృష్ణాది మహాపురుషులను, మహర్షులను స్మరించవచ్చును కాని వారంతా సృష్టికర్త తరువాతనే. మధ్యకాలంలో పుక్కిట పురాణాలు పుట్టుకవచ్చి అనేక దేవీదేవతల కల్పన జరిగింది. అన్నిటికీ వేరువేరు షోడశోపచార పూజలు, సుప్రభాతాలు కూడా వ్రాస్తున్నారు. వారినే సృష్టికర్తలుగా కూడా కీర్తిస్తున్నారు. మిగిలిన దేవీదేవతలంతా వారికి సహాయకులు, సేవకులు అంటున్నారు. మనవలెనే వారికిని భార్యాపిల్లలను, బంధుత్వాలను, ఇంద్రియ భోగాలను కామకేళిని కల్పిస్తున్నారు. మరి, సృష్టికర్త లెంతమంది ఉంటారు? అనేకమంది ఉంటే పరస్పర కలహాలు, ఆధిపత్యాలకోసం పోరాటాలు తప్పవుకదా! ఆలోచండి.

వేదం ఏకేశ్వరవాదాన్నే ప్రతిపాదిస్తున్నది. పుస్తక ప్రారంభంలో చెప్పినట్లుగా – "న ద్వితీయో న తృతీయో.... అంటూ అనేకేశ్వరవాదాన్ని ఖండిస్తుంది. ఆ ఏక తత్త్వానికే అనేక దివ్యగుణాలుండటంవల్ల అనేక పేర్లు చెప్పబడ్డాయి. పేరుకొక ఆకారం, పేరుకొక సంసారం, పేరుకొక చరిత్ర కల్పించడం మంచిదికాదు. హిందూ సమాజాన్ని ఛిన్నాభిన్నం చెయ్యటం అసలు మంచిది కాదు. ఇప్పటినుండైనా రకరకాల సుప్రభాతాలు, వ్రతకల్పాలు, నైవేద్యాలు, కళ్యాణాలు విరమించి హిందువులమని వ్యవహరింపబడే మనమంతా సృష్టికర్త చెప్పిన వేదమార్గాన్ని అనుసరిద్దాం, రండి. వైదిక సుప్రభాతంతో ప్రారంభించి మన ఆధ్యాత్మిక దినచర్యనంతా వేదమార్గంలోనే గడుపుకుందాం. మహర్షి దయానందుల వారు సంకలనం చేసిన వైదిక దినచర్యను అనుసరిద్దాం. అప్పుడు మన సంస్కృతీ సభ్యతలు వైజ్ఞానికము, యుక్తిసంగతము, తర్కసంగతము అవుతాయి. ప్రపంచ మానవులకు మనం మార్గదర్శకమౌతాము. మరల మనం ప్రపంచ గురువులమౌతాము. అస్తు.

**ఓ3మ్ స్వస్తి స్వస్తి స్వస్తి**

"వేదమును చదువుట, చదివించుట, వినుట, వినిపించుట ఆర్యులందరికిని (ఉత్తమ మానవులందరికిని) పరమ ధర్మము".

**మహర్షి దయానంద సరస్వతి**

(ఆర్య సమాజ 3వ నియమము)

# భగ సూక్తమ్-ప్రాతః స్మరణ సూక్తమ్

1. ఓం ప్రాత రగ్నిం ప్రాత రింద్రం హవామహే
ప్రాత ర్మిత్రా వరుణా ప్రాత రశ్వినా
ప్రాత ర్భగం పూషణం బ్రహ్మణస్పతిం
ప్రాతః సోమ ముత రుద్రం హువేమ. (ఋ. 7-41-1)

2. ఓం ప్రాత ర్జితం భగ ముగ్రం హువేమ
వయం పుత్ర మదితేర్ యో విధర్తా
ఆధ్ర శ్చిద్యం మన్యమాన స్తురశ్చిద్
రాజాచిద్యం భగం భక్షీత్యాహ. (ఋ. 7-41-2)

3. ఓం భగ ప్రణేతర్ భగ సత్యరాధో
భగేమాం ధియ ముదవాదదన్నః
భగ ప్రణో జనయ గోభిరశ్వైర్
భగ ప్రనృభిర్ నృవంతః స్యామ. (ఋ. 7-41-3)

4. ఓం ఉతేదానీం భగవంతః స్యామ
ఉత ప్రపిత్వ ఉత మధ్యే అహ్నామ్
ఉతోదితా మఘవన్ త్సూర్యస్య
వయం దేవానాం సుమతౌ స్యామ. (ఋ. 7-41-4)

5. ఓం భగ ఏవ భగవా నస్తు దేవా
స్తేవ వయం భగవంతః స్యామ
తం త్వా భగ సర్వ ఇజ్జోహవీతి
స నో భగ పుర ఏతా భవేహ. (ఋ. 7-41-5)

6. ఓం సమధ్వరాయోషసో నమన్త
దధిక్రావేవ శుచయే పదాయ ।
అర్వాచీనం వసువిదం భగం నో
రథమివాశ్వా వాజిన ఆ వహన్తు ॥ (ఋ. 7-41-6)

7. ఓం అశ్వావతీ ర్గోమతీర్న ఉషాసో వీరవతీః
సదముచ్ఛన్తు భద్రాః ।
ఘృతం దుహాన విశ్వతః ప్రపీతా యూయం
పాత స్వస్తిభిః సదానః ॥ (ఋ. 7-41-7)



# ఆర్యసమాజం సీతాఫల్‌మండి కార్యక్రమాలు

1. యోగ తరగతులు :- ఉదయం 5.30 గం॥ నుండి 7 గం॥ల వరకు స్త్రీ పురుషులకు మరియు సాయంకాలం 5.30 గం॥ల నుండి 7 గం॥ల వరకు స్త్రీలకు మాత్రమే నిర్వహించబడుచున్నవి.
2. దైనిక సంధ్య అగ్నిహోత్రములు :- ప్రతి రోజు ఉదయం, సాయంత్రం జరుగుచున్నవి.
3. సత్సంగములు :- సాప్తాహిక సత్సంగము-(ప్రతి ఆదివారము), మహిళా సత్సంగము ప్రీతి భోజనముతో పాటు ప్రతి నెల చివరి ఆదివారము. పర్వసత్సంగములు, పారివారిక సత్సంగములు నిర్వహించబడుచున్నవి.
4. వైదిక విద్యాలయము హైస్కూల్ :- నర్సరీ నుండి పదవ తరగతి వరకు ఇంగ్లీష్ మాధ్యంలో ప్రభుత్వ పాఠ్యప్రణాలికతోబాటు ధార్మికశిక్షణ కూడా బోధించబడుచున్నది.
5. సంస్కారములు :- కోరిన వారికి వైదిక షోడశ సంస్కారములు జరుపబడుచున్నవి.
6. హోమియో చికిత్సాలయం :- ధర్మార్థ హోమియో చికిత్సలయం ద్వారా సాయంత్రము 5.30 గం॥ల నుండి 8.00 గం॥ల వరకు వైద్య సేవలు అందించబడుచున్నవి.
7. విరాళాలు :- గురుకులాలకు, గోశాలలకు తగురీతిగా ఆర్థిక సహాయము లందించబడుచున్నవి.
8. ఇతర సమాజములకు :- బలహీన ఆర్యసమాజాలకు తగురీతిగా సహాయములు చేయబడుచున్నవి.
9. విపత్సమయాలు :- విపత్సమయాలలో బాధితులకు సహాయము లీయబడుచున్నవి.
10. ధర్మ ప్రచారము :- వేద ప్రచారముకొరకు మాసిక కరపత్రాలు మరియు వైదిక సాహిత్య ముద్రణ, ఉచిత వితరణ జరుపబడు చున్నవి.
11. ఉచిత వాచనాలయము :- వివిధ దిన మాసపత్రికలతో ప్రతిరోజు సాయంత్రం 5.30 నుండి 8.30 వరకు సేవలు అందించబడుచున్నవి.



## సృష్టికర్త సందేశం

ఓం ప్రాతర్+యజధ్వమ్+అశ్వినా హినోత న సాయమస్తి
దేవయా అజుష్టమ్ ।
ఉతాన్యో అస్మద్యజతే వి చావః పూర్వః పూర్వో యజమానో
వనీయాన్ ॥

– ఋగ్వేదం (5-77-2)

ఓ మానవులారా! వేకువఝామువనే మేల్కొని అశ్వినులను (ఉషా సూర్యులను) సేవించి శారీరిక మానసిక ఉన్నతులను పొందండి. అట్లే ఉదయ సాయంకాలలో అతిథులను (సంన్యాసులను, సాధుమహాత్ములను), తగిన విధంగా సేవించి ఉపదేశాలను పొందండి. వీరును అశ్వినులే. ఉషా సూర్యులవంటివారే. వీరితో బాటు యాజ్ఞికులను, సంఘసేవకులను, దేశరక్షకులను, విద్యావృద్ధులను, వయోవృద్ధులనుకూడా తగిన విధంగా సత్కరించండి. వారి వారి అనుభవాలను తెలుసుకొని మీ ఉన్నతికై యత్నించండి.

O Men!Have association with the teachers and preachers in the morning and evening. They are also like the sun and the dawn and please them (by offering milk and food etc.) so, that their power may grow. Serve those who approach-the enlightened persons. Honour him whoever performs Yajna, unites all and protect others who thus being older in age and knowledge are worthy of respect.




ఓం ప్రాతర్దేవీ మదితిం జోహవీమి మధ్యన్దిన ఉదితా సూర్యస్య ।
రాయే మిత్రావరుణా సర్వతాతేళే తోకాయ తనయాయ శం యోః ॥

– ఋగ్వేదం (5-69-3).

హే పరమేశ్వరా! సర్వాంతర్యామి! ఈ ప్రాతఃకాల సూర్యోదయ సమయాన అఖండ దివ్యగుణయుక్త దైవీబుద్ధికొరకు, సిరిసంపదల కొరకు అగ్నిలో ఆహుతులనిస్తూ (అందుకొరకు పూర్ణపురుషార్థం చేస్తూ) నిన్ను ప్రార్థింతుము గాక! ఇప్పుడేకాక మధ్యాహ్నమందును, సర్వకాలాలలోను నీ వేదాజ్ఞలనే పాలింతుముగాక! అగ్నిహోత్రంలో నుండి వెలువడే మిత్రావరుణ వాయువులవలె నీవు మా సంతానానికీ, మనుమలకు మేలు చేయుము. వారిపై శుభములను, సుఖములను వర్షింపచేయుము.

<u>వివరణ</u> : వేదాలలో అక్కడక్కడ మిత్రావరుణ పదములు సంయుక్తంగా (జంటగా) వస్తాయి. ఆ యా ప్రకరణాలను సందర్భాలనుబట్టి వాటి అర్థాలు వేరువేరుగా ఉంటాయి. ఈ భగసూక్తంలోని మొదటిమంత్రంలో ఈ జంట పదములు వచ్చాయి. అక్కడ ఆధ్యాత్మికార్థంలో మిత్రుడు, శ్రేష్ఠుడు అని అర్థాలు వ్రాయబడ్డాయి. అవే ఆధిభౌతికార్థంలో రాజు, మంత్రి లేదా ఆచార్య ఉపదేశకులు మొ॥ అర్థాలు వస్తాయి. ఇవే ఆధిదైవికార్థంలో ప్రాణ ఉదానవాయువులకు వర్తిస్తాయి. ఈ ప్రాణ ఉదానములు మన శరీరంలోనూ ఉంటాయి. సృష్టిలోనూ ఉంటాయి. అగ్నిహోత్రంలో దేశీ ఆవునెయ్యి ఆహుతులుగా యిస్తే ఈ వాయువులు వెడలి లోకానికి మేలు చేస్తాయి. వివరాలు నా రచన "అగ్నిహోత్రం 100% వైజ్ఞానికం"లో చూడండి.

Printed and distributed by :

**ARYA SAMAJ - SEETHAPHALMANDI**

Main Road, Seethaphalmandi (P.O.)
Secunderabad - 500 061. (Telangana)